నవంబరు 1993
సంపుటి : 9
సంచిక : 11

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడు పేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818


| | | |
|---|---|---|
| విడి ప్రతి | : రు. | 4-00 |
| సంవత్సర చందా | : రు. | 48-00 |
| 4 సం॥ల చందా | : రు. | 175-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 600-00 |
| పోషకులు | : రు. | 1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM


## విషయసూచిక



ముఖచిత్రం : 'యుగావతారి' శ్రీ సత్యసాయిబాబా

# మూర్తీభవించిన సత్యస్వరూపమే శ్రీ సత్యసాయిబాబా

— కొమరగిరి కృష్ణమోహనరావు

" అసూయకు No Reason, no Season, భయంకరమైన కాన్సర్ నివారణకు ఒక ఔషధం ఉన్నది. కాని ఈ అసూయ అనే రోగమును నివారించుటకు ఏమాత్రం వీలు కాదు " అన్నారు బాబా. అంతే కాదు ఈ అసూయకు ద్వేషము, క్రోధము, లోభములు : అనసూయకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు (సహనం, ప్రేమ, సానుభూతి) బిడ్డలుగా పుట్టారని బాబా చెప్పారు. కామ క్రోధ లోభములే సాధకునికి పరమశత్రువులు. కామం పెరిగి పెనవేసుకొని, ఉరిగా మారిపోయి తనతో పాటు తన వంశాన్నే నాశనం గావించుకున్నాడు రావణాసురుడు. దీనికి అహంకారం కూడా తోడైంది. పంచ భూతములను వశము చేసుకొనిన హిరణ్యకశిపుడు క్రోధంతో సర్వనాశనం అయినాడు. దుర్యోధనునిలో అసూయ పెరిగి ద్వేషం పెల్లుబికి లోభంతో, ధర్మ మూర్తులైన పాండవులకు సూదిమొన మోపే స్థలము కూడా యివ్వడానికి నిరాకరించి, తనతోపాటు తన కుటుంబాన్నే సర్వనాశనం గావించుకున్నాడు దుర్యోధనుడు. "రామాయణంలోపల కామం, భాగవతం లోపల క్రోధం, భారతం లోపల లోభం– ఈ మూడింటి ద్వారానే సర్వశక్తివంతులైనవారు సహితం సర్వ నాశనం అయినారు " అంటారు బాబా. "ఎన్ని శక్తులు సంపాదించినా ప్రయోజనం ఏమిటి ? ఇవన్నీ భౌతిక శక్తులే కదా ! దైవాన్ని మరచిన తరువాత ఎన్ని వుండి ఏమి ప్రయోజనం ? Hero becomes Zero, if he forgets God " అని అన్నారు బాబా. ఇది వాస్తవం. రావణాసురుడు, హిరణ్యకశిపుడు, దుర్యోధనుడు మొదలగు వారందరూ అసూయ, ద్వేషం, కామ క్రోధ లోభము మరియు అహంకారములతో దైవాన్ని విస్మరించడం వలన సర్వనాశనం అయినారు. అయితే యీ దుర్గుణాలన్నీ యీనాడు కలియుగంలో ఒకే వ్యక్తిలో కేంద్రీకృతమైనాయి. ఒక్కొక్కరిలో ఒక్కొక్క దుర్గుణం వుంటేనే, అలనాడు అంతటి మహాశక్తి సంపన్నులు పతనమైనారు. ఇన్ని దుర్గుణములు ఒకే వ్యక్తిలో కూడుకున్నప్పుడు, ఇంకా యీ మానవుడు ఎంతటి హీనమైన స్థితికి దిగజారిపోతాడో, ఈనాడు ప్రపంచంలో జరుగుతున్న దుస్సంఘటనలే ఇందుకు తార్కాణం. కనుక మనం అసూయా సంతతి వారం కాకూడదు అనసూయ సంతతివారం కావాలి

భగవాన్ బాబా ఏనాడో 'అ' కార చతుష్టయమును గురించి చక్కగా వివరించారు "1. అనుమానం. 2. అవిశ్వాసం 3 అసూయ 4. అహంకారం. ఈ నాల్గు దుర్గుణములలో ఏ ఒక్కటి మానవునిలో ప్రవేశించినా అతను పతనమైపోతాడు " అన్నారు బాబా. 'అనుమానం పెనుభూతం ' అన్నారు అనుభవజ్ఞులు. ' సంశయాత్మా వినశ్యతి ' అన్నది గీత ' అసూయ ద్వేషములు మానవుని పాలిటి వేరుపురుగులు' అన్నారు పెద్దలు. 'అహంకారం పతనానికి హేతువు' అన్నారు గదా ! కనుక ఎంతటి సాధకునిలోనయినా ఈ దుర్గుణాలు ప్రవేశించుతే పతనం కావటం ఖాయం. " అవిశ్వాసమే ఈనాటి మానవుని బలహీనత. ఈ అవిశ్వాసానికి అనుమానం కూడా తోడయ్యేసరికి అనర్థాలకు అడ్డు ఉండదు ఈ అనుమానమే శకుని, అవిశ్వాసమే కర్ణుడు. ఈ రెండిటి చేరికవలన అసూయ అనే దుర్యోధనుడు అభివృద్ధియౌతాడు ఇతని వెంట

అపహాసనం గావించే దుశ్శాసనుడు తిరుగుతాడు. అదే కౌరవవంశ నాశనానికి పునాది అయింది " అంటారు బాబా. అనుమానం, అవిశ్వాసం, అసూయ, అహంకారములనే 'అ' కార చతుష్టయ స్వరూపమే ' దుష్ట చతుష్టయము ' అంటే సరిపోతుంది

ఈనాడు మానవునిలో దుశ్చింతనలు, దురాలోచనలు దుశ్చర్యలు, దురభిమానములు అభివృద్ధి అవుతున్నాయి ఇలాంటివి తరతరాలనుండి, యుగయుగాలనుండి తరలి వస్తున్నాయని బాబా తన ఆవేదనను వెలిబుచ్చినారు. ఈనాడు ముఖ్యంగా భక్తులు అనబడేవారు బాబా ఆవేదనను ఎంతవరకు అర్థం చేసుకుంటున్నారు ? ఒకవేళ అర్థము చేసుకొనినా ఎంతవరకు వాటిని ఆచరణలో పెడుతున్నారు? ఎవరికివారు ఆత్మవిమర్శన చేసుకోవాలి ఆత్మవిమర్శన చేసుకొనకుండా, అవగాహన చేసుకొనకుండా, ఒకవేళ అవగాహన అయినా ఆచరణలో పెట్టకుండా కేవలం భజనలు చేస్తూపోతుంటే ప్రయోజనం లేదు. కేవలం భజనపరులం కాగూడదు, భక్తిపరులం కావాలి. "మనం భజనలు చేస్తున్నాం, భజనలు కేవలము ఆధ్యాత్మికముయొక్క సత్కర్మలు మాత్రమే గాని ఆధ్యాత్మికం కాదు భజనలు చేస్తున్నాము మనం భావాల్ని మార్చుకుంటున్నామా? లేదు మనలో వున్నటువంటి దుర్భావనలు, దుశ్చింతనలు, దురాలోచనలు అనేటటువంటి మృగతత్త్వాలు, పశుత్వాలు మనలో భజనలతోపాటు అవి కూడా పెరుగుతూనే వున్నాయి అట్టి పశుభావములను మనం అణగద్రొక్కకొనకుండా ఎన్ని విధములైన భజనలు చేసినప్పటికినీ, నీవు Singer (పాట పాడువాడు)వు కాదు, నీవు Sinner (పాపి) వే అవుతావు" అని అంటారు బాబా కనుక మనలోనున్న పశుత్వాన్ని నిర్మూలనం చేసుకొనకుండా, ఎన్ని విధములైనటువంటి, బాహ్యమైనటువంటి భజనలు, పూజలూ చేసినప్పటికినీ ఏమాత్రం ప్రయోజనం లేదంటారు బాబా.

" ఎవరైనా ఉత్తములను చూసినప్పుడు వారిపైన అసూయ కలుగుతుంది ఎవరైనా అభివృద్ధి చెందుతున్నారంటే, ఎవరైనా అందంగా ఉన్నారంటే, ఎవరైనా పేరుప్రతిష్ఠలు తెచ్చుకుంటున్నారంటే వారిపైన అసూయ కలుగుతుంది" అని అంటారు బాబా. ఇది ఎంతో అనుభవంతో కూడిన మాట. ఈ అసూయా ద్వేషములు ఇంతకుపూర్వం రాజకీయ పార్టీలలో మాత్రమే ఉండేవి అవి ఈనాడు అక్కడ ఇప్పుడు పరాకాష్టకు చేరుకున్నాయి. అయితే ఈనాడు ఈ జాడ్యం పరమపవిత్రమైన ఆధ్యాత్మిక సంస్థలలోకూడా వ్యాపిస్తున్నది. ఈ చీడపురుగులను ఎంత త్వరితంగా పారద్రోలితే అంత మంచిది. " Prevention is better than cure " అన్నారు గదా చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనం ఉండదు. అసలు ఈ దుర్గుణాలకు అవకాశమే యివ్వరాదు.

"ఎవరో బజారున పోయే Begger (బిచ్చగాడు) చెప్పే విషయాలను ప్రచారం చేయకూడదు. ఆ Begger చేసేటటువంటి ప్రచారం Beggerly (హీనమైనది)గానే వుంటుంది Begger ఎన్నటికీ Bigger కాలేడు Bigger (గొప్పవాడు, పెద్దవాడు) అయినటువంటివాడు సత్యమును ప్రచారించాలి సత్యానిత్య పరిశీలన చేయాలి. మనం ఒక విషయాన్ని ప్రచారం చేయాలనుకుంటే ఇది నిజమా? కాదా? అనే విషయమును తెలుసుకోవటానికి కొంతకాలమును తీసుకోవాలి" అని చెప్పారు బాబా అయితే దీనిని మనం ఎంతవరకు పాటిస్తున్నాం? ఎవరికివారు ఆత్మపరిశీలన చేసుకోవాలి. కేవలం బాబా చెప్పిన ప్రసంగాలను విని ఇంటికివెళ్ళితే

( తరువాయి 62 వ పేజీలో )

# మనోకంపముల ప్రతిబింబాలే భూకంపాలు

శ్రీ సత్యసాయి దివ్యవాణి

ప్రతి మానవుడూ ఈశ్వర స్వరూపుడే. దైవం సర్వత్రా ఉండినవాడైనప్పుడు, సర్వ ప్రాణులూ ఈశ్వర స్వరూపములే కనుకనే ఆనాటి వేదకాలములో ప్రతి మానవుని ఈశ్వర స్వరూపంగానే విశ్వసిస్తూ వచ్చారు. అదియే "సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్షః సహస్ర పాత్" వెయ్యి తలలుగా వుండేటటువంటివాడు ఈ భగవంతుడన్నారు. వేల నేత్రములతో కూడినటువంటివాడు భగవంతుడన్నారు. వేలపాదములతో కూడినటువంటివాడు భగవంతుడన్నారు. అనగా ఏమిటి? అన్ని పాదములు తనవే అన్ని నేత్రములు తనవే. అన్ని శిరస్సులు తనవే అన్ని దేహములూ తనవే. ఈ విశ్వాసమును మనం దృఢంగా నమ్మినప్పుడే మనం సరియైన ఆనందమును అందుకోగలుగుతాము. "నేనెక్కడ? దేవుడెక్కడ? నక్క ఎక్కడ? నాగలోక మెక్కడ? అని యీ రకంగా పోల్చుకుంటూ కూర్చుంటే, ఇక వేయి జన్మలు ఎత్తినా మనం ఆ స్థానమునకు చేరలేం.

పురందరదాసు చెప్పాడు. "రామా! నీవే దేవుడు, నీవే యముడు; యముడు వేరు లేడు, రాముడు వేరు లేడు. రాముడే యముడు, యముడే రాముడు. నమ్మిన విభీషణునకు రాముడై నిలిచావు. నమ్మని రావణునకు యముడై నిలిచినావు. కనుక యముడూ రాముడూ ఒక్కటే" అన్నాడు. నమ్మిన ప్రహ్లాదునకు శ్రీమన్నారాయణమూర్తిగా దర్శనమిచ్చాడు. నమ్మని హిరణ్యకశిపునికి యమునిగా నిలిచాడు. నమ్మిన అక్రూరునకు కృష్ణునిగా కనిపించాడు. నమ్మని కంసునకు యమునిగా కనిపించాడు. కనుక యముడెవరు? రాముడెవరు? ఇద్దరూ ఒక్కటే. ఈ నమ్మక అపనమ్మకములలో వుంటున్నాది రూపనామములు. నమ్మినవానికి దేవుడే నమ్మని వానికి దయ్యమే. కనుక దయ్యమునకు దేవునకు ఏమాత్రం వ్యత్యాసం లేదు. కనుక నమ్మి జీవించమన్నారు.

మానవుడనగా నమ్మకం గలిగినటువంటివాడు. అయితే మానవుడు యీనాడు అన్నింటిని నమ్ముతున్నాడు. **కాని దురదృష్టవశాత్తు, వాని జన్మాంతర** కర్మమేమోగాని దైవాన్ని మాత్రం నమ్మటంలేదు. ఆ నమ్మనివానికి దైవమే యముడుగా వస్తుంటాడు. ఆ యముడు పాశములు తీసికొనిరాడు. యమధర్మరాజుకు యీ ప్రపంచంలో ఎక్కడ Ropes Factory లేదు ఏమిటి ఈ Ropes (పాశములు)? అభిమాన మమకారములే పాశములు. ఈ రెంటితో బిగించి తీసుకొనిపోతాడు. నీ అభిమాన మమకారములే నిన్ను గొనిపోయే త్రాళ్లు. కనుకనే ఈ దేహాభిమానం, లోకాభిమానం, ధనాభిమానములు— ఈ సర్వాభిమానములను వదలి ఆత్మాభిమానములు అయిపోతే ఎంతైనా ఆనందమును పొందగలరు. కనుక ఆత్మాభిమానమును మనం పెంచుకోవాలి. అన్ని అభిమానములలో ఆత్మాభిమానం అంతర్వాహిణిగా ప్రవహిస్తూ వుండాలి

ఒక్క ఉదాహరణ. లడ్డు చేసినా, జిలేబి చేసినా ఇంకేమి చేసినా ఇవన్నీ చక్కెరతో కూడినటువంటివే. రూప నామములు వేరు కాని రుచి ఒక్కటే. అదే విధముగ భిన్నరూపములు, భిన్ననామములు కనిపిస్తున్నాయి గాని అన్నిటియందు వుండినటువంటి ఆత్మరుచి ఒక్కటే. భగవంతుడు పంచభూతస్వరూపుడు. ఈ పంచభూతములను మనం ఏ విధంగా ఉపయోగపెట్టు

(తరువాయి 59 వ పేజీలో)



# రాకపోకలు లేనటువంటిదే ఆత్మతత్త్వము

భగవాన్ సాయి దివ్యప్రబోధ

"మోక్షము" అనగా కేవలం ప్రకృతిని విసర్జించి, ఏకాంతమైన జీవితాన్ని గడపడం కాదు. "మోక్షము" అనేటటువంటిది ప్రత్యేకంగా మనం సంపాదించుకొనేటటువంటిది కాదు. మోక్షము పాతాళలోకమునుండి రాదు. ఉన్నతమైన స్థానమునుండి దిగదు. అజ్ఞానం నిర్మూలనం అయినప్పుడు చివరకు అది మనకు లభ్యమవుతుంది. నీ యొక్క సత్య స్వరూపాన్ని గుర్తించినప్పుడే అదియే "మోక్షము" అవుతుంది. సత్యము కానున్నంతవరకు ఇది మోహముతో కూడి ఉంటుంది. సత్యాన్ని గుర్తించిన తరువాత మోహం "క్షయ" మవుతుంది. "మోహక్షయమే మోక్షము."

-బాబా

"హెచ్చు విద్యలు చదివి ఇంద్రియలోలురై
చచ్చువారల కన్న స్వల్పమైరి
ఇంద్రియముల శక్తి ఇముడుకొంచును కాకి
అట్టి చదువులు చదివి ఆర్యులవుట
చదువు చదువు చదివి సంతసమును లేక
చింతనొందు వారె చపునరుండు"

విద్యార్థులారా!

ప్రాకృతమైనటువంటి జీవితము అనంతమైనటువంటి శక్తులతో, అప్రమాణమైనటువంటి జీవితాన్ని గడపటం- ఇది మానవమాత్రుల సహజం కాదు దమమును సాధించినటువంటి వాడే ధాంతుడు. ధాంతుడైనటువంటి వాడే వేదాంతుడు ధాంత వేదాంతముల యొక్క సమన్వయాన్ని, సత్యస్వరూపాన్ని అనుభూతులు విభూతిగా లోకానికి అందించినటువంటి వారే మన ప్రాచీన మహర్షులు. న్యాయవైశేషిక దర్శనములను, పదార్థములయొక్క సిద్ధాంతములను, అణుశక్తియొక్క సిద్ధాంతములను - ఈ సాంఖ్యము అంగీకరించదు. ప్రపంచమంతయూ కూడనూ విరుద్ధమైన శక్తుల సమన్వయ స్వరూపమేనని ఈ సాంఖ్యము ప్రబోధిస్తూ వచ్చింది. దీనికి కర్త కపిలమహర్షి. కనుకనే ఈసాంఖ్యదర్శనమును కూడనూ "కాతల" అనే మరొక పేరుతో పిలుస్తూ వచ్చారు. సంఖ్య యొక్క సమన్వయం చేత ఈ ప్రకృతి వుండటంచేత దీనికి "సాంఖ్యము" అని మరొక పేరు వచ్చింది. ప్రపంచమంతయూ సంఖ్యల చేత సమన్వయింపబడి స్వరూపాన్ని నిరూపించినటువంటి యొక్క దివ్యమైనటువంటిది ఈ ప్రకృతి నువ్వులలో తైలముండినట్లుగా, కర్రలలో నిప్పుండినట్లుగా, పువ్వులలో పరిమళముండినట్లుగా ఈ యొక్క ప్రకృతియందు కూడనూ పరమాత్మతత్త్వము కారణభూతమై ఉంటుంది. పరమాత్ముడు కారణ స్వరూపుడు, ప్రకృతి కార్యస్వరూపము. కార్యకారణములు అవినాభావ సంబంధములు కనుక ప్రకృతి ప్రత్యేకమైనటువంటిది కాదనియు, పరమాత్ముని యొక్క బాహ్యస్వరూపమేనసియూ ఈ సాంఖ్యము ప్రబోధిస్తూ వచ్చింది.

"సాంఖ్యము" అనగా తత్త్వము అని దీని అర్థము తత్త్వమనగా విచారణాశక్తి నిత్యానిత్య విషయములను పరిశీలన చేసేటటువంటి యొక్క ప్రబలత్వమైనటువంటి ఈ శక్తికి "తత్త్వము" అని మరొక పేరు. ఒక్క పదార్థముచేత సృష్టి అనేటటువంటిది ఏర్పడుటకు వీలు కాదు. రెండు పదార్థములు చేరినప్పుడే ఈ రెండు శక్తుల యొక్క సమ్మిశిత స్వరూపమే మూడో శక్తి ఆవిర్భవిస్తుంది ఒక హస్తముచేత శబ్దము ఏర్పడదు. రెండు హస్తములూ చేరినప్పుడే శబ్దము ఏర్పడుతుంది. ఒక్క చేతి చేత వేడి పుట్టదు రెండు చేతులయొక్క రాపిడి చేతనే వేడి ఆవిర్భవిస్తుంది అటులనే ప్రకృతి పరమాత్మల సమ్మిశిత స్వరూపమే ఈ సృష్టికి మూలకారణము. కనుక ప్రకృతి ప్రత్యేకమైనటువంటి స్వరూపమని భావించడం అజ్ఞానం అంతర్భూతమై అవ్యక్తంగా, దివ్యత్వమైనటువంటి పరతత్త్వము ఇందులో వున్నదని సాంఖ్యము ప్రబోధిస్తూవచ్చింది.

ఈ ప్రకృతికి 24 సంఖ్యలు వున్నవి 5 కర్మేంద్రియములు, 5 జ్ఞానేంద్రియములు 5 ప్రాణములు పంచతన్మాత్రలు, అంతర్భూతమైనటువంటి మనస్సు బుద్ధి చిత్తము, అహంకారము —ఈ 24 తత్త్వములతో గూడినటువంటిది ఈ ప్రపంచము. ఈ 24 తత్త్వములు కూడనూ పరస్పర విరుద్ధమైనటువంటివిగా వుంటున్నాయి నీరు ఉంటే నిప్పు ఉండదు. గాలి వుంటే నిప్పు ఉండదు. ఒకదానికొకటి పరస్పర విరుద్ధమైనటువంటి శక్తుల సమన్వయమే ఈ ప్రపంచము ఇట్టి విరుద్ధమైన శక్తుల సమన్వయముతో కూడినటువంటి ఈ ప్రపంచమును మూడుభాగములుగా పోలుస్తూ వచ్చింది సాంఖ్యయోగము మానవుడు దైవత్వాన్ని పొందుటకు ఈ మూడే మూల కారణమని నిరూపిస్తూ వచ్చింది సాంఖ్యము

"మోక్షము" అనగా కేవలం ప్రకృతిని విసర్జించి, ఏకాంతమైన జీవితాన్ని గడపటం మోక్షం కాదని చెప్పింది ఈ సాంఖ్యం. ఈ ప్రకృతియొక్క 24 తత్త్వములతో పురుషుడు చేరినప్పుడు 25 వ తత్త్వముగా రూపొందుతుంది. ఈ 24 తత్త్వములూ పురుషునకు విషయములు (Matter) అని ప్రబోధించింది కనుక ఈ పురుషుడు 25వ తత్త్వముతో కూడినటువంటివాడైనాడు జీవుడు ప్రకృతిని, పురుషుని విసర్జించి, విమర్శించి, కొంతవరకు విభాగము సలిపి 26 వ శక్తి అనేటటువంటి పరమాత్మతో (శివుని) లీనమవుతూవచ్చాడు జీవుడు. కనుక 24 తత్త్వములూ ప్రకృతిని, పురుషుడు 25 వ తత్త్వమువాడు, ఈశ్వరుడు 26 వ తత్త్వమువాడు. కనుకనే 26 తత్త్వములతో కూడినటువంటిది ఈ మానవ తత్త్వము మానవుని యందే ప్రకృతి, పురుష, జీవతత్త్వములు ఏర్పడివుంటున్నాయి.

" జీవుడున్న దేహామందు హృదయమందు దేవుడుండె. రెండు కూడి ఆటలాడి ఒకరినొకరు వీడుచుండె. బొమ్మలాటలాడించే సూత్రధారి ఒకడు కలడు. మంచి చెడ్డ బొమ్మలుండె, ఒకటిలోనె రెండు వుండే. ఒకటిలోనే రెండు వుండేటటువంటి తత్త్వాన్ని మనం ఏరీతిగా గుర్తించాలి? ఏకత్వములో అనేకత్వమును భావించటం సామాన్య మానవుని స్వభావము కాని అనేకత్వంలో ఏకత్వాన్ని గుర్తించడమే మహనీయుల లక్షణం కనుక మానవత్వమనేటటువంటిది కేవలం దైవత్వముతో కూడినటువంటి ఏకత్వమేగాని భిన్నత్వంకాదని ఈ సాంఖ్యము ప్రబోధిస్తూవచ్చింది.

" మానవుని హృదయమందు కలదు ఒక్క కల్పతరువు దాని చుట్టు వనస్పతుల కల్ప గంప పెరిగివుండు. కలప తీసి శుభ్రపరచ కల్పతరువు కానబడును. అదియే నీ అభీష్ట

ములను కోసగు కామధేనువు, కల్పవృక్షము, కామధేనువు ఒక్క మానవుని యందే వుంటున్నాయి. ఈ మానవత్వమనేటువంటిది గోచరమయ్యే వస్తువునకు, అగోచరమయ్యే వస్తువునకు మధ్య ఒక వారధివలె వుంటున్నది ఇట్టి మానవత్వము మధ్యలో వుండినటువంటిది కాబట్టే మానవునకు 'మర్త్యుడు' అని మరొక పేరు. కనిపించినటువంటి దృశ్యములను మాత్రమే చూచి ఇది నిజమని భావించరాదు. ఇది కనిపించునటువంటి పదార్థము యొక్క ప్రతిబింబమే కాని ఇది బింబము కాదు "కనిపించునదే నిజమందురు. కనిపించనిదే కల్లయందురు. కనిపించనిదే తినిపించును మీ కర్మఫలము మర్మము జీవా!" ఏది మనకు కనిపించకుండా ఉంటున్నదో, అదే మన కర్మ ఫలమునకు సరియైన మార్గాన్ని అందిస్తున్నది కనుక కనిపించని దాని యందే మన కర్మ ఫలమంతా యిమిడిఉన్నాది.

"మనస్సు" అనగా కేవలం పరిశుద్ధమైనటువంటి ఒక కాగితము వంటిది కాదు అనేక జన్మల సంస్కారములనేటటువంటివి అందులో వ్రాయించబడినటువంటివి. దానినే 'చిత్తము' అని చెబుతూవచ్చారు ఈ చిత్తమును గుర్తించుకొనేటటువంటివాడే "చిత్రగుప్తుడు" అన్నారు ఎవడు ఈ చిత్రగుప్తుడు? చిత్తములో గుప్తముగా వుంచినటువంటివాడే 'చిత్రగుప్తుడు' అదియే ప్రజ్ఞాశక్తి (Radiation). ఆ ప్రజ్ఞాశక్తి అనేటటువంటిది ప్రాణశక్తిని స్థంభింపజేస్తుండాలి Vibration గావిస్తుండాలి Radiation is responsible for vibration ఈ Vibration యొక్క ప్రభావం చేతనే బలమైన దేహము చలింపదగుతుండాలి కనుకనే 'భూర్భువస్సువః' అనేటటువంటి యొక్క Radiation, Vibration Meterialisation - ఈ మూడింటి యొక్క ఏకత్వమే మానవత్వము కనుక మానవుడనేటటువంటివాడు ఈ మూడింటితో కూడినటువంటివాడే దీనినే జీవం, ప్రకృతి, పురుషత్వం అన్నారు ఈ మూడింటి యొక్క ఏకత్వాన్ని సాంఖ్యము అనుభవిస్తూవచ్చింది.

## సోమరితనం

"Laziness is Rust and Dust
Realisation is Best and Rest"

సోమరితనమే తుప్పు ధూళి. సాక్షాత్కారమే ఉత్తమోత్తమమైనది. అయితే ఈ నాటి విద్యార్థులలో సోమరితనం ప్రబలిపోతున్నది. శుభ్రత లేకుండాపోతున్నది తన దుస్తులను, తన శరీరమునే శుభ్రముగా వుంచుకోలేని సోమరిపోతు దేశాన్ని ఏమి శుభ్రపరచగలడు? ఇట్టి విద్యార్థులు దేశమునకు ఏ విధమైన ఆదర్శమును అందించగలరు? ఏ ఉద్దేశ్యమును చాటగలరు?

— బాబా

ఈ సాంఖ్యము యొక్క తత్త్వము మరికొన్ని విధములుగా మనము విచారణ చేసినప్పుడు 'మోక్షము' అనేటటువంటిది ప్రత్యేకముగా మనము సంపాదించికొనేటటువంటిది కాదు మోక్షము ఏ పాతాళలోకమునుండి రాదు ఉన్నతమైన స్థానము నుండి దిగదు. మన అజ్ఞానము నిర్మూలనం అయినప్పుడు చివరకు లభ్యమవుతుంది. కనుకనే మోక్షమునకు అనేక

ప్రయత్నములు చేయనక్కరలేదని ఈ సాంఖ్యం వివరించింది. ఏ విధముగ ? నీ యొక్క సత్య స్వరూపాన్ని నీవు గుర్తించినప్పుడు అదియే మోక్షము అవుతుంది. సత్యము కానున్నంతవరకు ఇది మోహముతో కూడి వుంటుంది. సత్యాన్ని గుర్తించిన తరువాత మోహము 'క్షయ' మవుతుంది. 'మోహక్షయమే మోక్షము' అని నిరూపించింది తాను తన యొక్క నిజస్వరూపాన్ని గుర్తించక, కేవలం భౌతికమైన ఈ దేహమే తనయొక్క ఆకారమని విశ్వసించి, ఈ ఆకారము యొక్క సుఖశాంతుల నిమిత్తమై, అనేక విధములైన ప్రయత్నములు సలిపి, కాలమునంతా వ్యర్థము గావించుకుంటున్నాడు మానవుడు కాని తానే "సత్య స్వరూపుడు" అనేటటువంటి యొక్క నిత్య తత్త్వాన్ని గుర్తించడానికి సాంఖ్యము చాలా సహాయపడుతూవచ్చింది.

పిచ్చివాడా! ప్రపంచం 24 తత్త్వములతో కూడినటువంటిది. పురుషుడు మరొక తత్త్వముతో కూడినటువంటివాడు. జీవుడు కూడనూ ఒక తత్త్వములో ఉండినటువంటి వాడు. ఈ తత్త్వములు ఉండినంత వరకునూ, మనకు సత్యము గోచరించదు ఈ యొక్క తత్త్వమునకు అతీతుడు కావాలి. అదియే నిజమైన Super Mind. ఈ Super Mind యొక్క దివ్యమైన మనస్తత్త్వాన్ని మొట్టమొదట మనం గుర్తించాలి. ఈ Super Mind అనేటటువంటిది కూడనూ ఒక విధమైనటువంటి పవిత్రతతో కూడినది, లేక ఉన్నతమైనది అనేటటువంటి గుణం వుండాలి. ఈ SuperMind నుంచి కూడనూ Illuminated mind కు పోయినప్పుడే Higher Mind ను గుర్తించడానికి వీలవుతుంది. కప్పు వుండినంతవరకునూ ఆకాశమును మనం చూడలేము పై కప్పును తీసివేసినప్పుడు ఇక్కడ నుంచే ఆకాశమును మనం చూడవచ్చును. అదేవిధముగనే Lower Mind, Super Mind, Illuminated Mind, Highermind లను దాటిన తరువాత Over Mind లోపల సర్వస్వమూ మనకు గోచరమవుతుంది కనుక మనస్సుకు అతీతుడు కామని సంఖ్యలతో కూడినటువంటిది అంతనూ కేవలం సాంఖ్యమే అవుతుందని, సాంఖ్యమంతా ప్రకృతితో కూడినదని, ప్రకృతి దృష్టిని విరమించుకున్నప్పుడే పరమాత్మదృష్టి సాక్షాత్కరిస్తుందని ఈ సాంఖ్యము ప్రబోధించింది

సాంఖ్యతత్త్వము లోపల మరికొన్ని విభాగములు కూడా ఉంటున్నాయి. మానవత్వమనేటటువంటిది ఆత్మతత్త్వముతో కూడినదని, ఈ ఆత్మ అనేటటువంటిది కొన్నిరకములైన పరిశోధనలతో ఏర్పడేటటువంటిది కాదని, సహజమైనటువంటి తత్త్వముతో వున్నదని, ఈ దేహము వుండినా, లేకపోయినప్పటికినీ, దీని యొక్క వ్యాప్తి సర్వత్రా వున్నదని నిరూపిస్తూవచ్చింది ఏవిధముగ? కరెంటు వైర్లువేసినాము. కాని ఆ వైర్లలోని విద్యుచ్ఛక్తి మనకు కనిపించదు. బల్బు పెట్టినచోటనే ఈ విద్యుచ్ఛక్తి ప్రభావము ప్రకాశిస్తుంది. ఆ బల్బు తీసిన తక్షణమే విద్యుచ్ఛక్తి ప్రభావం కనిపించదు. అప్పుడు ఆ విద్యుచ్ఛక్తి ఎక్కడికి పోయింది? ఎక్కడికీ పోలేదు. అక్కడే వుంటున్నది. నీవు బల్బు పెట్టక పూర్వం విద్యుచ్ఛక్తి ఉన్నది. బల్బు పెట్టినప్పుడూ విద్యుచ్ఛక్తి ఉన్నది. బల్బు తీసిన తరువాత విద్యుచ్ఛక్తి ఉన్నది. కాబట్టి మన దేహములు బల్బులవంటివి. దివ్యమైన ఆత్మతో సంబంధం కలుగకపూర్వమూ దాని యొక్క విద్యుచ్ఛక్తి వున్నది. ఈ దేహమనేటటువంటి బల్బు పెట్టినప్పుడు కూడనూ విద్యుచ్ఛక్తి ఉంటుండాలి. ఈ దేహము క్షీణించిన తరువాత కూడనూ అక్కడనే ఆత్మశక్తి ఉంటుండాలి. "రాకపోకలులేనటువంటిదే ఆత్మతత్త్వము." కేవలం దేహ భ్రాంతి చేత

గుర్తించినట్లుగాను, అది లేనప్పుడు పోయినట్లుగానూ మనం భావిస్తున్నాం ఎన్ని విధములైన విద్యలు మనం నేర్చినప్పటికినీ ఎన్ని విధములైన సాధనలు సలిపినప్పటికి గమ్యము మాత్రము పొందక తప్పదు.

మానవుని యొక్క పరమావధి ఏమిటి ? పరతత్త్వాన్ని అనుభవించటమే పరమావధి త్యాగరాజు కూడా చెప్పాడు "చుట్టు చుట్టు పక్షులెల్ల చెట్టు వెదకురీతి భువిని" ఓ ! రామా ! పక్షులు ఎంత ఎత్తైన ఆకాశములో సంచరిస్తున్నప్పటికీ, ఎప్పటికైనా ఒకప్పటికి తిరిగి ఒక చెట్టును వెదకక తప్పదు. చెట్టును ఆశ్రయించక తప్పదు ఎంతసేపు ఆకాశంలో సంచరిస్తాయి ? తిరిగి ఒక చెట్టును ఆశ్రయించేతీరాలి అటులనే మానవుడు ఎన్ని జన్మలు ఎత్తినప్పటికినీ, ఎన్ని సాధనలు చేసినప్పటికినీ, దివ్యత్వమైన దానిని ఆశ్రయించక తప్పదు ... తప్పదు కనుక ఏనాడో మనకు తెలియక, ఎప్పుడో దీనిని ఆశ్రయించే బదులు, తెలిసి ఈనాటినుంచే మనం దీనిని ఆశ్రయించడానికి తగిన ప్రయత్నం చేయమని సాంఖ్య మనలను హెచ్చరిస్తూవచ్చింది దైవత్వమనే దానిని విస్మరించడం మానవత్వం కాదని చెప్పింది ఇది మానవత్వంలో వుండిన దానవత్వమేనన్నది. ఈనాడు మానవుడు చేయవలసిన సాధన ఏమిటి ? సాధనా సాధ్యములు మనం చేయనవసరం లేదు. మానవుని యందున్న దానవత్వాన్ని నిర్మూలనంచేసి, మానవత్వాన్ని పెంచుకొని, దివ్యత్వంతో లీనం కావటం అంతే చాలు కనుక మనం నివురుతో కూడినటువంటి నిప్పును చూడాలనుకుంటే, మనం ఏమేమో సాధనలు చేయనవసరం లేదు "ఉఫ్" ... అని ఊదితే నివురు పోతుంది, నిప్పు కనిపిస్తుంది. నీటి పైన కప్పిన పాచిని మనం ఏదేదో యంత్రతంత్రములతో గాని, జపతపములతో గాని దానిని చూడటానికి ప్రయత్నించడంవలన ప్రయోజనం లేదు ఆ పైన కప్పిన పాచిని ప్రక్కకు నెట్టితే, నీరు మనకు సాక్షాత్కరిస్తుంది. అదే విధముగా పరిశుద్ధమైన

## మహోన్నత డాక్టరు

నీ దర్శనమైతే చాలదా సాయికన్నయ్యా
నిస్సత్తువతో నీరు కారిపోయిన నరనరాలు
నాట్యం చేయవా !
నీ పాదాలు తాకితే చాలదా, సాయి
కన్నయ్యా
ఆగిపోయే హృదయవీణ మృదుమధుర
శృతులు పలుకదా !
నీ మధుర మాటలు వింటే చాలు
సాయికన్నా
మహోన్నత మధుర చిరునవ్వుల మోమైన
నవ్వుల వర్షం కురిపించదా !
మనుషుల మనస్సులు మంచికి మార్చి
ఆనంద ఆరోగ్యాలు పెంపొందింప చేసే
మహిలో మహోన్నత డాక్టరు నువ్వే
కన్నా ! నువ్వే ప్రశాంతి సాయికన్నా
త్రికరణశుద్ధితో, నీ మాటలు విని,
నీ మార్గంలో నడిస్తే
తనువులన్ని పొంగవా ! ధరణి
యంతో ఉప్పొంగదా !

— పి. రాజ్యలక్ష్మి రంగారావు

హృదయ తత్త్వమునకు అనేక విధములైన విషయ వాసనలనేటటువంటి పాచి కప్పబడింది. దానిని సత్కర్మలనే చేతులద్వారా దానిని ప్రక్కకు నెట్టాలి నీళ్ళపైన కప్పిన నిపురును వేరు చేయాలంటే "నామస్మరణ" అనే నోటితో దానిని దూరంచేయాలి అప్పుడే మనకు సాక్షాత్కారం లభిస్తుంది. కలిలో చాలా సులభమైన మార్గం ఇది. ఈ కలియుగంలోపల "నామస్మరణ"కు మించినది మరొకటి లేదని చక్కగా ప్రబోధిస్తూవచ్చింది కనుక దివ్యత్వాన్ని మనం అనుభవించవలెనని సాంఖ్యతత్త్వాన్ని మనం కొంతవరకు విస్మరించాలి. ప్రకృతిని కొంతవరకు విస్మరిస్తే, పరమాత్మ తత్త్వమును విశ్వసించటానికి వీలవుతుంది. కనుక సాంఖ్య శాస్త్రమనేటటువంటిది ప్రకృతి, జీవ, పరమాత్మల యొక్క సమ్మిళితమైన స్వరూపమని చక్కగా నిరూపిస్తూవచ్చింది. 24 తత్త్వముల ప్రకృతి, పరమాత్మ ఒక తత్త్వము, జీవాత్మ మరొక తత్త్వము ఈ రెండూ చేరినప్పుడే 26 తత్త్వములతో కూడినదవుతుంది. దీనినే రామదాసు చెప్పాడు "మాయకు లోనవును మాయకు లోనవును మాయ ఇరువై ఐదు మర్మములవును మాయ ఇరువై అయిదు మర్మము తెలిసితే మాయ... మాయ .... మరి బయలవును." కనుక ఈ తత్త్వములను మనం చక్కగా అర్థం చేసుకుంటే, 26వ తత్త్వము మనమే అయిపోతాం. ఇదే సాంఖ్యము యొక్క చక్కని సులభమైన మార్గమును ప్రబోధించింది. మనయందుండినటువంటి కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, పంచ ప్రాణముల యొక్క తత్త్వమును దూరం చేసుకొనుటకు వీలు కాదు. కాని దానిని మనం సరియైన మార్గంలో ప్రవేశపెట్టాలి కొంత నియమాన్ని మనం అనుసరించాలి. నియమం లేనప్పుడే మనం ఈ ఇంద్రియములను సక్రమమైన మార్గంలో ప్రవేశపెట్టలేం.

సృష్టి యొక్క చిత్రం ఎంత విచిత్రంగా వున్నదో గుర్తించవచ్చును రాత్రింబవళ్ళు, ఋతువులు - ఇవన్నీ తమ తమ నియమములను అనుసరిస్తూ నియమానుసారంగా ప్రవర్తిస్తున్నాయి. ఈ నియమమే లేకుండిన రాత్రింబవళ్లే లేవు రాత్రింబవళ్లే లేకుండిన ఋతువులే రావు ఋతువులే లేకుండిన మానవునికి ఆహారమే లభ్యంకాదు. కనుక నియమమనేటటువంటిది చాలా ప్రధానమైనటువంటిది. **ఈ 26 తత్త్వములతో** కూడినటువంటి ప్రకృతియే ఇంత నియమాన్ని పాటిస్తున్నది

చిన్న ఉదాహరణ నియమమనేది పాటించక పోయినప్పుడు ఎన్ని విధములైన మార్పులు చెందుతాయనేది మానవుడు చక్కగా గుర్తించాలి ఇంగ్లాండ్‌లో ఒక రైతు పాలవ్యాపారం చేస్తూవచ్చాడు అతను చక్కగా ప్రభుత్వంయొక్క నియమాలను పాటిస్తూనే వచ్చాడు సత్యహృదయుడు, ధర్మబద్ధంగా పాలు అమ్ముతూవచ్చాడు. కాని కొన్ని దినముల తరువాత ఆ పాలలో కొంత మార్పు వచ్చింది. మంచి పాలు అమ్మటం లేదని కోర్టులో వేసారు దీని పైన విచారణ ప్రారంభమైనది జడ్జీ ఆ రైతును అనేక విధముల ప్రశ్నించాడు. ఆ రైతు ఉన్నది ఉన్నట్లుగా వివరించాడు అయితే ఆ న్యాయాధికారి తానే స్వయంగా కొంతమందిని తీసుకొని వెళ్ళి పశువుల నుండి పాలను పితికించి చూచాడు. పాలు మంచిగా లేవని గుర్తించాడు. ఇది రైతు యొక్క దోషము కాదని, పశువులయందే లోపం వున్నదని గ్రహించి ఆ తరువాత ఆ రైతును విచారించాడు. ఆ రైతు ఇంటిలో వున్న కొన్ని యిబ్బందులవలన, అశాంతులవలన ఆ పశువుల నుండి సకాలంలో పాలను పితుకటంలేదని గురించాడు ఆ

న్యాయాధికారి. వీలున్నప్పుడల్లా పాలను పితకటం అమ్మటం చేస్తున్నాడు ఆ రైతు. ఈ విధంగా నియమాన్ని ఉల్లంఘించి, సకాలంలో రైతు పాలను పితకక పోవటంవలననే పాలలో మార్పు వస్తున్నదని న్యాయాధికారి గ్రహించాడు. పశువును కూడా చక్కగా పోషించి, నియమబద్ధంగా నిత్యమూ ఒకే కాలంలో పాలను పితుకుతే పాలలో ఏ దోషమూ వుండదని, నియమాన్ని పాటించకపోతే పశువులు యిచ్చే పాలలో కూడా మార్పు కనిపిస్తుందని న్యాయాధికారి నిర్ణయించాడు. రైతులో ఏ దోషమూ లేకపోయినప్పటికీ, నియమాన్ని ఉల్లంఘించడం వలన పశువులిచ్చే పాలలో కూడా తేడా కనిపిస్తుంది. అదే విధముగా ఈ నాటి మానవుని యొక్క స్వభావాన్ని కూడా చక్కగా వివరించాలి. ద్వేషము, అసూయ, కామము, దుర్మార్గ భావముల లాంటివి హృదయంలో చేరినప్పుడు - తాను అన్నం తినే సమయమునందు ఆ జీర్ణకోశమునందుండిన దుర్వాసన మెదడుకు తగులుతుంది. ఆ దుర్వాసన మెదడుకు సోకినప్పుడు దుర్బుద్ధులు ప్రారంభమవుతూవస్తాయి. కనుకనే నియమాన్ని పాటించనప్పుడు ఆహారముసుండి, పానీయమునుండి ఈ విధమైన దుర్మార్గపు శక్తులు మానవునికి అనేకవిధములైన ప్రమాదములు కలుగ జేస్తుంటాయి. అసలు మనసు ఎక్కడనుండి పుడుతున్నది? మనసు ఆహారం నుంచే పుడుతున్నది. మనం ఎట్టి ఆహారమును భుజింతుమో అట్టి మనసే ఏర్పడుతుంది. కనుకనే మన మహర్షులు సాత్వికాహారమును భుజించమని చెప్పారు.

మన ప్రాణం ఏమిటి? త్రాగే నీరే ప్రాణం. తిన్న ఆహారము స్థూలమైనది మలంగా వెళ్లుతుంది. సూక్ష్మమైనది కండరాలుగా తయారవుతుంది. అతి సూక్ష్మమైన ఆహారమే మనసుగా మారుతుంది. అదే రీతిగనే త్రాగిన నీరులో స్థూలమైనటువంటిది మూత్రంగా పోతుంది. సూక్ష్మమైనటువంటిది రక్తంగా రూపొందుతుంది. అతి సూక్ష్మమైన జలమే ప్రాణంగా మారుతుంది. కనుక జలములో ఆ ప్రాణశక్తి ఉన్నది. ఎవరైనా మూర్ఛ వచ్చి పడిపోతే నీళ్ళు తెచ్చి చల్లి

## సామాన్య భక్తి - అనన్య భక్తి

"భక్తి రెండువిధములు. 1) సామాన్య భక్తి 2) అనన్యభక్తి. సామాన్య భక్తి మూర్తి పూజలతో మూర్తి ఆరాధనలతో ప్రారంభమవుతుంది కొందరు దీనిని హాస్యాస్పదంగా, అల్పమార్గంగా భావిస్తున్నారు. ఇది చాలా పొరపాటు. ఐ.సి.ఎస్. ఆఫీసరయినా ఆదిలో ఎ, బి, సి, డి లు దిద్దవలసినదే గదా! అవతార పురుషుడైనా పసిబిడ్డగా తప్పటడుగులు వేయక తప్పదు గదా! ముక్తిపురుషుడైనా ప్రారంభంలో పూజలు చేయవలసిందే. దేహాత్మభావన వుండినంతవరకూ సాకార పూజలను, ఆరాధనలను మానుటకు వీలు కాదు."

"1) స్వార్థ భక్తి, 2) నిస్వార్థ భక్తి 3) పరార్థభక్తి, 4) పరమార్థభక్తి. మొదటి మూడు ఆరాధనలు సామాన్య భక్తి క్రిందకు వస్తాయి. నాల్గవది అనన్యభక్తి క్రిందకు వస్తుంది. భగవంతుడు హామీ యిచ్చింది అనన్యభక్తులకేగాని, ఏ పావుగంటో, అరగంటో లేక గంటో భగవంతుని చింతించే Part time Devoteesకోసం కాదు."

- బాబా

తారు అనగా ఆ నీటిలో ఈ ప్రాణశక్తి ఉంటుండాలి. అయితే ఈ ఆహార పానీయములు మనం తీసుకొనే సమయంలో సాత్వికమైన భావంతో తీసుకోవాలి. కనుకనే మన పూర్వీకులు అన్నం భుజించేముందు "ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా" అని భగవంతునికి అర్పితం చేసి ఆ జలమును తీసుకునేవారు పంచ ప్రాణములను అర్పితంచేసి, అది ప్రసాదంగా భుజించటం చేత, ఆ ఆహారంలో దోషం లేకుండా పోతుందని మన విశ్వాసం.

మన విద్యార్థులకు బాగా తెలుసు "బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః ..." అని భుజించే ముందు అర్పితం చేస్తున్నారు. ఎందుకు ? ఈ పదార్థములో మూడు విధములైన దోషములు ప్రవేశిస్తున్నాయి. పాత్రశుద్ధి పాకశుద్ధి, పదార్థ శుద్ధి – ఈ మూడూ శుద్ధిగా వుండినప్పుడే చిత్తశుద్ధి ఏర్పడుతుంది. ఈమూడూ శుద్ధిగా లేనప్పుడు అశుద్ధి భావములు మనలో ఆవిర్భవిస్తాయి. పాత్ర శుద్ధిని కొంతవరకు మనం చేయవచ్చును. కాని పదార్థ శుద్ధి మాత్రం కష్టం. ఏ అంగడిలో ఏమి తెచ్చామో ! ఆ అంగడివాడు ఎక్కడ దొంగిలించి తెచ్చాడో ! ఇవన్నీ మనం చూడలేం. కనుక యీ పదార్థముల శుద్ధిని మనం చూచుటకు వీలు కాదు. ఇక పోతే పాకశుద్ధి. పదార్థములు వండే సమయంలో వండేవాడికి ఎలాంటి భావాలు వుంటుంటాయో, వండే సమయంలో దుర్భావనలతో వండుతుంటే, ఆ దుర్భావనలే యీ పదార్థములో ప్రవేశిస్తుంటాయి. కనుకనే యీ పాత్రశుద్ధి, పాకశుద్ధి, పదార్థ శుద్ధి చూడటానికి అసాధ్యమైనది కనుకనే దానిని "బ్రహ్మార్పణం" అనగా భగవంతునికి అర్పితం చేసినప్పుడే యీ దోషములు పరిహారమైపోయి, అది పరిశుద్ధమైనటువంటిదిగా రూపొందుతుంది. అది భుజించే అన్నం కాదు, ప్రసాదంగా రూపొందుతుంది. ఇది పరిశుద్ధం కావటానికి లోపల వున్నటువంటి కారణం ఏమిటి ? నీవు బ్రహ్మార్పణం చేసినప్పుడు "అహం వైశ్వానరో భూత్వా..." నీవు లోపలికి పంపించినదంతా నేను వైశ్వానరో రూపంలో వుండి, నేనే దానిని జీర్ణిస్తున్నాను అని అర్థము. కనుక భగవంతుడే దానిని జీర్ణింపజేస్తున్నాడు గనుక అది పరిశుద్ధమైపోతున్నది యీ ప్రార్థననే చేయకుండా ఏదో జఠరాగ్నిలో వేస్తున్నానని భావిస్తే, నిప్పులో వేసినటువంటి పదార్థము వలె మాడిపోతుంది. జఠరాగ్ని లోపల భగవంతుడు వైశ్వానర రూపంలో వున్నాడనే విశ్వాసంతో వేయాలి. అయితే యీనాడు దీనిని చాలామంది పాటించటంలేదు. యీనాడు చాలామంది టి వి లు చూస్తూ భోజనం చేస్తుంటారు. వాటిని చూస్తూ ఆ భావాలతోనే అన్నం తినటంచేత ఆ భావాలే వస్తున్నాయి పిల్లలు చెడిపోవటానికి ఇదే కారణం. కనుకనే ఆహారశుద్ధి అత్యవసరమని యీ సాంఖ్య బోధిస్తున్నది. ఎందుకంటే పంచ ప్రాణముల యొక్క అంతర్భూతంగా వుంటున్నది యీ ఆహారం. మన దేహమే ఆహారము యొక్క స్వరూపము. ఆహారమే ఆహారాన్ని భుజిస్తుండాలి. దీనిని చక్కగా గుర్తించాలి. మన దేహము తల్లిదండ్రులు తిన్నటువంటి ఆహారము యొక్క సారమే. కనుక ఇది ఆహారమే. ఈ ఆహారము యొక్క దేహము మరొక ఆహారము భుజిస్తుండాలి. కనుక ఆహారము ఆహారమునే భుజిస్తుండాలి. అన్నమయ జీవితం మన దేహం. భుజించేది కూడ అన్నమే కనుకనే ఆహారం ప్రధానమని బోధిస్తూవచ్చింది సాంఖ్య.

ఈ సూక్ష్మమైన విషయాలను ఎవరూ గుర్తించరు. అతి సూక్ష్మమైనదాని యందే అతి ఘనమైనది యిమిడి

ఉండాలి చిన్న చిన్న చదలే కర్రకు పట్టి కర్రనంతా భస్మం చేస్తుంది. కనుక చిన్నదికదాయని మనం అలక్ష్యం చేయకూడదు. కనుక మనం ఉన్నతమైన, ఉత్తమమైన భావములు పెంపొందించుకోవాలి ఇక్కడ న్యాయవైశేషికము అణుశాస్త్రమును ఎక్కువగా బోధించింది ఒక అణువుకు, మరొక అణువుకు భిన్న బేధములుంటాయని చెప్పింది కాని సాంఖ్యము ఈ "అణువు" అనే పదమునే తీసుకొనిరాలేదు ప్రపంచమంతా అణుమయ స్వరూపమే. ప్రతి పదార్థము అణుమయమే. పంచభూతములూ అణుమయమే అంతా అణుమయమే అయినప్పుడు, తిరిగి అణువని ప్రత్యేకంగా బేధము ఎందుకు పెట్టాలి? అంతా అణువే. ఈ అణువే భగవత్ స్వరూపము. దీనిని "అణోరణీయాం మహితో మహీయాం" ఈ అణువునందే వుంటుండాలి దివ్యత్వం. కనుక దివ్యత్వాన్ని ఈ మూడు దర్శనములు కూడనూ నిస్సందేహంగా విశ్వసించాయి. అయితే సాంఖ్య దర్శనంలో వుండిన సత్యస్వరూపాన్ని యోగదర్శనంలో దీనిని సాక్షాత్కరింపజేస్తుంది.

న్యాయమనేది సత్యస్వరూపము న్యాయమే సత్యము సత్యమే న్యాయము అదియే ప్రకృతి ప్రకృతి సత్య స్వరూపము ఈ ప్రకృతి నిన్ను బాధిస్తున్నదని, ఈ ప్రకృతి నిన్ను మోసం చేస్తున్నదని నీవు భావిస్తున్నావు. పొరపాటు ... పొరపాటు ... ప్రకృతి నిన్ను వంచించేడం లేదు నీవే ప్రకృతిని వంచిస్తున్నావు. ఈ సత్యాన్ని గుర్తించాలి. ప్రకృతి ఎప్పుడూ పవిత్రమైనది, పరిశుద్ధమైనదే. ఆ పరిశుద్ధమైన ప్రకృతి ఎట్టి మానవునియందు ప్రవేశిస్తున్నదో, ఎట్టి భావములు గల మానవునియందు ప్రవేశిస్తున్నదో, అట్టి భావ స్వరూపాన్ని పొందిపోతున్నాది. ఈ టంబ్లర్‌లో పరిశుద్ధమైన జలము ఉన్నది దీనిలో ఏమాత్రం మాలిన్యంలేదు. కాని ఈ పరిశుద్ధమైన జలమును ఎర్రని సీసాలో పోస్తే ఎర్రగాను, పచ్చటి సీసాలో పోస్తే పచ్చగాను కనిపిస్తుంది. సీసాల రంగు ఎలావుంటుందో ఆ సీసాలోని జలం కూడా అదే విధంగా కనిపిస్తుంది.

## నీవు నా వాడవు !

ప్రహ్లాదుడను గాను భక్తిసంపదతోడ
నారసింహుని రూపు తేరి చూడ
ప్రాణసఖుండైన బడుగు కుచేలుడ
గాను సౌభాగ్య భాగ్యంబు పొంద!
కన్నప్ప నాగాను కన్నులు జత చేసి
నీలకంఠుని దివ్యలీల లెరుగ!
పవనసుతుడగాను భద్రాద్రి రాముని
హృదయ పద్మంబులో పదిలపరుప!
ఎవ్వరునుగాని నేనెవ్వరేమిటనుచు
కొట్టుమిట్టాడి విలపించు పట్టునందు
'నీవు-నావాడ'వేనని నిగ్గు దేల్చి
సందియము దీర్చె 'శ్రీసత్యసాయి' తండ్రి!

ఏకా రామచంద్రరావు

కాని జలములో బేధములేదు. సీసాలలోనే బేధమున్నది. అదే విధముగా మన దేహములన్నీ సీసాలవంటివి. గ్లాస్‌బుడ్డి వంటివి. ఎప్పుడు పగులుతుందో ! ఎప్పుడు ఏ విధమయిన పరిస్థితి సంభవిస్తుందో ! చెప్పలేం. కనుక ఎలాంటి భావాలను మనలో నింపుకుంటామో అలాంటి పనులనే మనం చేస్తుంటాం విద్య దుర్మార్గుని హృదయంలో ప్రవేశిస్తే ఇది అహంకారమయమయిపోతుంది. కాని సజ్జన హృదయంలో ఈ విద్య ప్రవే

శిస్తే సత్యమార్గమును అనుభవిస్తుంది వినయ విధేయతలను ప్రదర్శిస్తుంది. విద్యలో దోషం ఏమాత్రమూ లేదు అదే విధముగనే ధనం కూడాను దుర్బుద్ధులు గల వానివద్ద చేరితే ఈ ధనమును దుర్వినియోగం చేస్తాడు. సద్భావనలు గల వానిచేతిలో ఈ ధనం చేరితే సత్కార్యములు చేస్తాడు. కనుక ధనంలో భేదం లేదు, విద్యలో భేదంలేదు ఈ విద్యను, ఈ ధనమును ఏ విధమయిన హృదయంలో నింపుకుంటున్నారో, ఆ హృదయంలో ఉన్నది దోషం. ఈ పంచభూతములు, పంచేంద్రియములు, పంచప్రాణములు పరిశుద్ధమయినవే పవిత్రమయినవే కాని ఈ పంచకోశములతో కూడినటువంటి ఈ దేహంలో ప్రవేశించినప్పుడు, పవిత్రత, అపవిత్రత అనేటటువంటి రూపాలను ధరిస్తున్నాది కనుక పవిత్రమయిన తలంపులను మాత్రమే అభివృద్ధి పరచుకోవాలి. అహంకారమునకు, ఆడంబరమునకు, అసూయకు, అశాంతికి, అక్రమ అనాచారములకు అవకాశం యివ్వరాదు అవి చేరిన తక్షణమే ముల్లును తీసివేసినట్లు వాటిని తీసిపారేయాలి దుర్భావనలకు అవకాశం లేకుండా సద్భావనలను మనలో పెంచుకోవాలి ఈ సద్భావనలు పెంచుకొనుటకు మనం పవిత్రమయిన గ్రంధాలను కూడా చదవాలి చదివినప్పుడు విన్నప్పుడు విచారించినప్పుడు మాత్రమే వాటి విశిష్టత మనకు తెలుస్తుంది భేదము లేనటువంటి తత్త్వాన్ని ఈ షడ్దర్శనములు ప్రబోధిస్తూవచ్చాయి కనుకనే భేదములకు అవకాశం యివ్వకూడదు. మనమందరమూ ఒక జాతి పౌరులమే అందరమూ మానవులమే. ఈసత్యాన్ని విస్మరించరాదు.

ఈ షడ్దర్శనములలో ఎట్టి భేదములూ లేవు. చదివేవాడి యొక్క మనః భేదములే ఇందులో ప్రతిబింబిస్తుంటాయి. నిశ్చలమైన జలం లోపల సూర్యుడుగాని, చంద్రుడుగాని నిశ్చలంగా కనిపిస్తారు కదిలే జలం లోపల సూర్యచంద్రాదులు కూడా కదిలినట్లే కనిపిస్తారు. కాని సూర్య చంద్రులు కదలటంలేదు జలం యొక్క ప్రభావం చేతనే కదిలినట్లుగా కనిపిస్తుంటారు. అదే విధముగ మన హృదయం యొక్క ప్రభావములను పురస్కరించుకొనియే, మన మంచి చెడ్డలు అపిర్భవిస్తున్నాయి మంచి చెడ్డలు ఏమాత్రం బయట లేనే లేవు అయ్యో! నేను చూచాను అనుకుంటున్నావు. ఇది నీ అజ్ఞానమే నీ Imagination దీనికి మూల కారణం. కనుకనే 'యద్భావం తద్భవతి' అన్నారు. కనుక మీరు ఈ విధమయిన భావాలను పరిశుద్ధం గావించుకోవడానికి కృషి చేయండి! జీవితాన్ని సార్థకం చేసుకోండి!

( బృందావన్‌లో జరిగిన వేసవి తరగతులలో ది 29-5-93 న భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి )

# యుగావతారి - భగవాన్ బాబా

-జి. వి. యస్. సుబ్రహ్మణ్యశర్మ

అనంత విశ్వంలో ఉద్భవించే 84 లక్షల రకాల జీవరాశులలో మానవజన్మ కొక వైశిష్ట్యం ఉంది బహు జన్మార్జిత పుణ్యఫలం వలన గాని ఈ మానవ జన్మ లభింపదు అయినా ఈ మానవజన్మ కర్మాధీన మైనదే ! దానికంటే ఉత్తమమైనది దివ్య జన్మ ఆ దివ్య జన్మ ఎప్పుడు ? ఎలా ? వస్తుందో ఎవరూ ఊహింపలేరు. భగవత్సంకల్పమే ఈ దివ్య జన్మకు మూలకారణం. దీనినే అవతారం అంటారు పెద్దలు. ఈ జన్మ రహస్యాన్ని గూర్చి ద్వాపరయుగంలో శ్రీకృష్ణభగవానుడు " సంభవామి యుగే యుగే " అనీ జన్మ కర్మ చ మే దివ్యం " అనీ, భగవద్గీతలో వివరించాడు శిష్ట రక్షణ కొరకును దుష్ట శిక్షణ కొరకును, ధర్మస్థాపన కొరకునూ భగవంతుడవతరిస్తుంటాడు "అని గీత పేర్కొంది ఆ అవతారాలుకూడా ఎప్పుడు, ఎలా వస్తాయో ఎవరికీ తెలియదు. అందుకే "ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామి యుగే యుగే" అని సాక్షాద్భగవంతుడైన శ్రీకృష్ణుడే స్వయంగా తన అవతార రహస్యాన్ని వివరించాడు. లోకకల్యాణ దీక్షయే, శాంతిస్థాపనయే అవతార రహస్యం. ప్రతిఫలాపేక్ష లేకుండా, లోకోద్ధరణకై ప్రేమను పంచడమే అవతార రహస్యం. అవతారం అంటే క్రిందికి దిగి రావటం అని అర్థం (అవ = క్రిందకి, తారం = దాటి (దిగి) వచ్చుట) అనంత కల్యాణగుణాభిరాముడు, షడ్గుణైశ్వర్య సంపన్నుడు, అపరిమేయుడు, ఈజుడు అయిన పరమాత్మ తన అనంత శక్తి, వైభవ ప్రాభవ మును తన సంకల్పము మేరకు అవ = తగ్గించుకొని, తారము = అత్యున్నతమైన వైకుంఠధామము నుండి భూలోకమునకు, పరిమితమైన రూప నామములతో దిగి వచ్చుటనే అవతారమని మరి కొందరు మహాత్ములు వివరించినారు అట్టి అవతారములలో ఒకటి మన భాగ్యవశమున నేడు పుట్టపర్తిలో సాక్షాత్కరించు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి అవతారము ఈ విషయమును స్వామియే స్వయముగా -

" యుగ ధర్మ పద్ధతుల్ విశకలితమై యుండ
నయమార్గమున ద్రిప్పి నడుపుకొఱకు,
లోకంబులెల్ల కల్లోలమై చెడియుండ
నిష్కల్మషము చేసి నెగడుకొఱకు,
దుర్మార్గబుద్ధులై క్రుంగి దీనత నుండ
సాధు సంరక్షణ సలుపుకొఱకు
కాలసందిగ్ధ విగ్రహ దీప్తులై యుండు
భాష్యార్థ గోప్యముల్ పలుకు కొఱకు
పాప భారము బాపె భూదేవి మనుపుకొఱకు
త్రేత నొసగిన కోర్కెలు తీర్చుకొఱకు
అవతరించెను అచ్యుతు డవనియందు
సత్యరూపుడై పర్తిలో చూడుడిపుడు "

అనియును :

" ఏ గుణంబు గణించి ఏతెంచెనో నాడు
ప్రహ్లాదు పాలింప పరమపురుషుడు "

అను పద్యంలో చివరకు :

" ఆ త్రిజగన్నాథు డీనాడు అవతరించె
శ్రీనివాసుడు లోకైక చిన్మయుండు
వెల్గె పర్తీశుడై నేడు పృథివియందు "

అని తన అవతార ప్రయోజనాన్ని, రహస్యాన్ని వివరించారు. ఈ విషయాన్నే నేను నా సాయిరామా గ్రంథంలో ఇలా వివరించాను

శ్లో॥ లోకోద్ధరణ దీక్షయా స్వయ మజోప్యాస్థా
విహీనోఽపిసన్
సత్యం జ్ఞాన మనంత భక్త సులభత్వం
చాత్మనో దర్శయన్,
సాక్షాదత్ర గతోఽను చిత్రవిషయే
పర్త్యాం ద్విజో రాజతే
భారద్వాజ కులోద్భవార్చిత హర
సాయీశ్వరో దేశికః ”

తాత్పర్యము : పరమాత్మగా తనకు జన్మ లేకున్నను (కాలాయనమః, కాలాతీతాయనమః, అజాయనమః, నిత్యాయనమః, ఆదిపురుషాయనమః, అవ్యక్తాయనమః) ఐహిక, పారలౌకిక భోగములయందును కామము లందును కూడ ఎట్టి యిచ్ఛయు లేనివాడైనను, తనకు సహజములగు సత్యము, ధర్మము, అనంతమైన భక్త సులభత్వము మొదలగు దైవీసంపదలను ప్రకటించుచు, లోకరక్షణమునకై కంకణమును కట్టుకొని, సాయీశ్వరుడను దేశికుడు (గురువు) చిత్రావతి ఒడ్డున ఉన్న పుట్టపర్తియను గ్రామమునందు విరాజిల్లుచున్నాడు. (చిత్రావతీతట పుట్టపర్తి విహారిణేనమః) గోత్ర నామ ములకతీతుడైనను, ఆ దివ్యపురుషుడు లీలగా భారద్వాజ కులమునందవతరించి, (భారద్వాజ ఋషి గోత్రాయ నమః) శివునర్చించుచు తన జన్మ ద్వారమున “సంభవా మ్యాత్మమాయయా” అను వాక్యమును ఋజువు పరచు చున్నాడు.

శ్లో॥ దర్శనం చోత్సవో యస్య నేత్రయోః,
కర్ణయోరపి,
కీర్తనం; తూపదేశస్య పానం కుక్షే;
తమాశ్రయే

తా॥ సాధారణముగా లోకములో కంటికింపైన వస్తువు, చెవికింపైన శబ్దము చేయజాలదు. అట్లే చెవి కింపైన శబ్దము కన్నుల కానందము నివ్వజాలదు ఇది లౌకిక వస్తువుల లక్షణము. కాని స్వామి దివ్యుడు కనుక ఆయన దర్శనము కనులకు విందొదుచెను. (సర్వజన ప్రియాయనమః) ఆయన చేయు కీర్తనములు పాడునట్టి భజన గీతములును, శ్రవణ శుభగములగును. ఇక ఆయన అందించు ఉపదేశామృత ధారలనందుకొని జుర్రినచో కడుపు నిండి సంపూర్ణమగు తృప్తిని, ఆనందమును చేకూర్చును ( ఆనందదాయనమః ) ఇట్లొక్కడు తన దర్శన, గాన, ఉపదేశాదుల ద్వార మున జీవులందరి యొక్క సర్వేంద్రియముల అఖండా నందమును ప్రసాదించి తన్మయులను చేయుట దివ్యత్వ మునకు నిదర్శనము కాదా ! అట్టి దివ్యుడైన స్వామిని నేనెప్పుడూ నాశ్రయింతును

నిజ సంకల్పానుసారము, జీవోద్ధరణ మార్గము నుపదేశించుటకై అవతరించిన యుగావతారిని ప్రత్యక్ష ముగా చూచి, వారి యుపదేశములను ప్రత్యక్షముగా విని, స్వయముగా వారిని సేవించుకొను అదృష్టము నేటి మానవులకే పూర్వజన్మ కృత సుకృత ఫలముననో సిద్ధించినది చే జిక్కిన ఈ సదావకాశమును జార విడుచుకొనకుండ, భగవాన్ బాబావారిని, దర్శించి, వారి యుపదేశముల నాలకించి, వానిని ఆచరించి మన జన్మను సార్థక పరచుకొను నవకాశమిప్పింపుమని సర్వదేవతాతీత స్వరూపుడగు ఆ భగవానుని ప్రార్థింతము.

# బాబా భగవాన్ కాక మరెవరు?

పెరపరసు

శ్రీమతి లక్ష్మి నెల్లూరులో డాక్టరు ఆమె భర్త శ్రీ సచ్చిదానందం పిళ్ళై నెల్లూరు వెంకటగిరి రాజా వారి కళాశాల ప్రిన్సిపల్. అంతకు ముందు వారు కాకినాడలో ఉంటూ ఉండేవారు. స్వతః వీరు కోయంబత్తూరుకు చెందినవారు.

వారింట్లో ప్రతి గురువారం "సత్యసాయిబాబా" భజనలు జరుగుతూఉండేవి. వారున్న తెరువులోనే డా॥ రాజగోపాలాచారిగారు షిర్డి సాయిబాబా భక్తులు నివసిస్తుండేవారు భక్తిలో ఎవరి తెన్ను వారి దన్న విశాలత్వము వారిలో కొంత లోపించడం వల్ల డా॥ లక్ష్మిపై, పుట్టపర్తి బాబావారిపై డా॥ రాజగోపాల వారిగారు అప్పుడప్పుడు కొన్ని మాటల విసుర్లు విసుర్తూ ఉండేవారు. అప్పుడు సరిగ్గా నాకు 14 ఏండ్లు. ప్రతి గురువారం డా॥ లక్ష్మి ఇంట్లో విర్వహింపబడే సమూహ భజనలకు హాజరయ్యేవాడిని. వారు పాడే అన్ని పాటలను అనతికాలంలో నేర్చుకున్నాను వారితోబాటు పాడేవాడిని. అది సన్మార్గుల గుమి. పదాలలోగాని, పాదాలలోగాని, రాగపథంలో గాని ఏమాత్రం తప్పు లేకుండా నేను పాడుతున్నానని, నన్ను ముందు వరుసలో కూర్చోమని డా॥ లక్ష్మి ఆదేశించేవారు బృంద భజనలు రసవద్ఘట్టాలలో ఉన్నప్పుడు, అక్కడ ఉన్న అనేకమైన బాబా ఫోటోలలో ఏదో ఒకటి కదలటం, ఎవరో మృదువుగ మాలలను ఊపుతున్నట్లుగ ఊగటం, పుష్పాలు రాలటం - ఇల్లాంటి విచిత్రాలు జరుగుతుండేవి.

"బొరుగులు - బెల్లం" కోసం భజనలకు భజనలకు నేను వెళ్తుంటానిని కొందరి మిత్రుల మాటలకు నొచ్చుకొని, మరుసటి వారం భజనానంతరం కర్పూరహారతి ముగిసిన వెంటనే అక్కడ నుండి నిష్క్రమించాను. నా చర్యకు డా॥ లక్ష్మి చాలా బాధపడ్డారు. ఆ తర్వాతి వారాలలో ప్రసాదం పుచ్చుకొనేంతవరకు నన్ను వెళ్ళనీయకుండ కట్టుదిట్టం చేశారు.

ఆమె ఎంతో తన్మయత్వంతో పాడేవారు. ప్రపంచంలో ప్రతి అణువులో బాబా ఉన్నట్లు ఆమె విశ్వసించేవారు మా అందరి దృక్కులలో ఆమె ఒక మాతృవు? ఆమె మాట అంత మృదువు.

1954 లో బాబాగారు డా॥ లక్ష్మి ఇంటికి విచ్చేశారు. ఆ సమయంలో నేను బాల్య చాపల్యం వల్ల ఎక్కడో ఆటల్లో మునిగి ఆలస్యంగ వారింటికి చేరాను 'అరెరె! బాబాగారు ఇప్పుడే వెళ్ళారు. నీవు పోగలిగితే రేబాల లక్ష్మీనరసారెడ్డి (M P.) గారి బంగళాకు వెళ్ళు. రాత్రికి వారి బస అక్కడే. దర్శనం చేసుకోవచ్చు" అని డా॥ లక్ష్మి సలహా ఇచ్చారు

రోడ్డు వెంబడి నడిస్తే వారి బంగళా చాలా దూరం రైలుకట్టమీద సాగిపోతే కాస్త దగ్గర. అయితే చీకటి, రేకటి పాములు పట్టాలపై యథేచ్ఛగ తిరుగాడుతుంటాయి. రాత్రి 8 గం నా వయస్సు 14 ఏండ్లు ఆయన దర్శనం చేసుకోవాలన్న తపన విపరీతం కావడంతో ఏదో విచిత్రమైన తెంపును నాలో నింపుకొని గబగబ నడిచాను.

బైట గేటు దాటి పోర్టికోలో కాలుపెట్టాను. రెండు మూడు కార్లు నిలిచిఉన్నాయి. నిశ్శబ్దంగా ఉంది. వరండాలో ఒక ఆజానుబాహువు ఖద్దరు కండువా, ధోవతీ జుబ్బాతో పొదచ్ఛాయలేస్తూ, నన్ను చూచి ఆగి 'ఎవరు' అన్నట్లుగ నా వంక చూచాడు.

"బాబాగారిని చూడటానికి వచ్చాను" అన్నాను.

"వారు పెద్ద పెద్ద వారితో మేడమీద భోజనం చేస్తున్నారు" అన్నాడు. "నీవేమిటి ఆయన్ను చూడట మేమిటి" అన్న ధ్వని ఆ పలుకులలో పొలికింది. ఆయన తన హోదా అన్న కమండలంనుండి చులకన అన్న భావ జలాలను నాపై చిలకరించినట్లు నేను గ్రహించినా, ఒక్క క్షణంసేపు కళ్ళు మూసుకొని మనసులో "బాబా! నిన్ను చూడటానికి వచ్చాను" అని కళ్లు తెరిచాను ఒక్కసారిగ ఒడలంతా తీయని పులకింత!

ఎదురుగా, ఆరాళ సాంద్రకుంతలాలతో దీర్ఘ కాషాయ వస్త్రాలతో మందహాసంతో బాబా నిలబడిఉన్నారు.

అంతకు ముందు నాకు సమాధానమిచ్చిన ఆ పిడుపాటి రెడ్డిగారు ఏమయ్యారో ఊహించలేని విషయం అంత కంటే ఊహాతీతమైనది - బాబాగారు నా వద్దకు ఎలా వచ్చారు? బాబాగారు ఎదురుగ నా వద్దకు వచ్చి ఉంటే నాలుగు గడపలు దాటి రావాలి. మేడపై నుండి దిగి వస్తే, మెట్లపై వారు నాకు గోచరించాలి మేడపై భోజనం చేస్తున్న బాబా అక్కడున్న పదిమంది మధ్యలో అదృశ్యమై నా వద్దకు వచ్చారా! బాబా అక్కడ అదృశ్యమైతే అక్కడి వారు గగ్గోలు పడిపోకుండా ఎలా ఉన్నారు! లేదా అక్కడ మేడమీద - ఇక్కడ నావద్ద బాబా ఇరు రూపాల్లో తారసిల్లారా! పోర్టికోలో నిలిచి ఉండిన ఆ అజానుబాహువెవరు! ఎవరికీ సందేహం రాని ఆ "రెడ్డి" రూపంలో బాబాగారే అవతరించి నా కోసం వేచిఉన్నారా? అప్పటి నా అవగింజ అంత అంతరంగానికి ఆ సంఘటన ఒక వింధ్యపర్వత మంతటి అర్థం కాని విషయం.

ఆ వయస్సులో నాకు ఏమి కోర్కెలుండును? ఆ చందనాంగుని ఎడమే లేనంత చేరువగ దర్శించాను కళ్ళార! మనసార నమస్కరించాను వెంటనే ఆశీర్వదించారు. గాలిలో చేయి ఊపి విభూదిని దానం చేశారు స్వీకరించాను. మనస్సు నిశ్శబ్ద సరస్సు అయింది. ఇక సంతృప్తితో వారి పాదాల స్పృశిస్తూ సాష్టాంగం చేశాను వారి పాదాలు కుసుమాలతో తయారుచేసినంత మృదువుగ ఉన్నాయి.

"వెళ్ళొస్తాను బాబా" అని మరలా నమస్కరించి, వెనుదిరిగి, ఒక మెట్టుదిగి మరలా బాబాను చూడాలని తిరిగాను. అక్కడ బాబాగారు లేరు! "రెడ్డిగారు" అంతకు పూర్వమే అదృశ్యం!!

ఇప్పుడనుకుంటాను! స్త్రీ పురుషులు ఉభయులను ముగ్ధులను చేయగల్గిన ఆకర్షణశక్తి భగవంతుడు కలిగి ఉన్నా, తనను వేధిస్తారని కాబోలు, స్త్రీ పురుషుల మధ్యనే పరస్పర పరవశత్వాన్ని, ఆకర్షణను ఆయన సృష్టించాడని ఇది ఒక అభేధ్యమైన మాయ! "మాయాయా వంచితో నరః" అంటారు విజ్ఞులు. దీనిని ఛేదించుకున్నవాడు ఉన్నతుడు అయితే ఇటువంటి మాయా మారుతం తరుణ వయస్సులోనున్న వీయని తరుణంలోనే బాబా కరుణాంతరంగుడై - విగూఢంగ, విచిత్రంగ, ప్రాత్యేకికంగ - నిరంతరం బంధు మిత్ర సేవక సమ్మర్దంతో ఉండవలసిన ఆ బంగళా ప్రాంగణంలో, నిశ్శబ్ద వాతావరణాన్ని నిర్మించి, ఎంతో ఆప్యాయతతో "నా రాకకు ఎదురు చూచి", "నాకై వేచి" నాకు ఏకాంత దర్శనమిచ్చి నన్ను ఆశీర్వదించారంటే, దీని వెనుక ఏదో బలవత్తరమైన కారణం ఉండాలి! ఆయన సర్వజ్ఞులు గనుక ఆయన్ను దర్శించాలనే ఉక్క నాలో పొక్కినప్పుడే అందుకు తగ్గ ఏర్పాటు ముందుగనే చేశారు. వారు పైగా త్రికాలజ్ఞులు గనుక భవిష్యత్తులో నేను చేయబోవు ఏవో కార్యక్రమాలకు ఎట్టి ఆటంకాలు కలుగకుండ నన్ను ఆశీర్వదించి ఉండాలి ఆ భావమే తర్వాత పటిష్టమైంది. కారణం, నేను చేపట్టిన అసాధ్యమైన పనులు



నిర్విఘ్నంగ పూర్తి అయ్యాయి. "విత్తు సహకారి కాకున్న రిత్తనేల, వంధ్యమగు గాని ఫలవంత మగునే" అన్నట్లు వారి దైవబలం నాకు పూర్ణసహకృతి కాకుండినచో, నా పరిశ్రమ పుటకలోనే చట్టుబారి ఉండేది. కనుక ఈ కార్యాలన్నీ నేను పూర్తిచేశానని ఎచ్చులు పడడంకంటె, వారే నాచేత పూర్తి చేయించారన్నదే నేను ఆత్మార నమ్మిన సత్యం!

వారి ఆశీర్వాదబలంవల్ల నేను రెండు గొప్ప విషయాలను నేర్చుకున్నాను.

1. కర్మ - ధర్మము.
   కర్మలు ఎంత చిత్తశుద్ధితో చేసినా, ధర్మాన్ని ఎరుగనంతవరకు విముక్తి లేదు.
   ధర్మాన్ని ఎరిగిన ఉత్తరక్షణం, కర్మల వలన ఏర్పడే బాట పీడ విరగడ అయిపోవటమేకాక, విధి నిర్వహణ సుగమమై, శాశ్వతత్వానికి నడపగలము (కర్మ-ధర్మముల వివరణ మరియొక అవకాశమున వివరింతును).
2. సుఖాలలోగాని, కష్టాలలోగాని సత్యాన్ని ఏమాత్రం విడువని వానిని భగవంతుడు ఎప్పుడు నీడవలె తోడై ఉంటాడు.

"యం పాలయసి ధర్మత్వామ్
ధర్మస్త్వా మభి రక్షతు"

దాదాపు పది సంవత్సరాల పిదప, ఒకరోజు డా॥ లక్ష్మి నాకు ఫోన్‌చేసి, "బాబాగారు మా యింటికి వస్తున్నారు. మీకు వీలయితే సాయంత్రం రా!" అని పిలిచారు. అప్పటికి శ్రీ సచ్చిదానందం పిళ్ళై, డా॥ లక్ష్మి రిటైరై మద్రాసు-టీ నగరులో స్థిరపడ్డారు.

సాయంకాలం 6-15 గం కు వారింటికి వెళ్ళాను, వారి ప్రక్క ఇల్లు జోట్-రాబర్ట్స్ కంపెనీ డైరెక్టరు, శ్రీ లక్ష్మణ్‌గారి భవంతి. డా॥ లక్ష్మికి ఆయన సమీప బంధువు. ముందున్న పెద్ద హాలులో బాబావారి పటాలు ఉంచి అఖండ భజన చేస్తున్నారు భక్తులు. రాత్రి 8 గం॥ వరకు బాబాగారి జాడలేదు. టీ నగర్‌నుండి తిరువత్తూరు చేరాలంటే చాలా పొద్దు పోతుంది అని డా॥ లక్ష్మితో చెప్పి తిరిగి వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను. వీరి ఇరువురి నివాసాల మధ్య ఉన్న ప్రహరీకి ఒక వికెట్ గేట్ ఉంది. ఆ గేటు దాటి దానికి గడపమీద కాలు పెట్టాను. మఱునిముషం నా మనస్సు అల అంత ఎత్తుకు నన్ను పెంచింది. సంతోషమనే సెలలను ఉరికించింది.

**Magnet** (అయస్కాంతము)

"When the magnet does not attract the needle, the fault lies in the durt. That covers up on the neecle, when the lord does not approach Tha devotee the fault lies in the heart of the devotee; It is not pure enough."

"అయస్కాంతం సూదిని ఆకర్షించలేదంటే దానికి సూదిమీదవుండే తుప్పే కారణం. అదేవిధముగా భగవంతుడు భక్తుని అనుగ్రహించలేదంటే భక్తుని హృదయం వుండవలసినంత నిర్మలముగా లేక పోవటమే." - బాబా

హృదయం ఎంతో వెడల్పు అయింది, ఆ ప్రవాహాలను నింపుకోటానికి !

ఎదురుగా బాబా ! !

సోత్సాహంతో చేతులు జోడించాను. వెంటనే ఆశీర్వదించారు. "ఇక నేను వెళ్లొస్తాను లక్ష్మి !" అంటూ

> తల్లి గర్భమునుండి ధనము తేడెవ్వడు
> వెళ్ళిపోయేనాడు వెంటరాదు
> లక్షాధికారైన లవణమన్న మేగాని
> మెరుగు బంగారంబు మ్రింగబోడు
> విత్తమార్జనచేసి విఱ్ఱవీగుటెగాని
> కూడబెట్టిన సొమ్ము తోడరాదు
> పొందుగా మరుగైన భూమిలోపలఁ బెట్టి
> దానధర్మము లేక దాచి దాచి
> తుదకు దొంగల కిత్తురో దొరల కగునొ
> తనది యనియెడు నట్టిది ధనము కాదు
> ఆత్మయొక్కటె శాశ్వత మరసి చూడ
> సత్యమును తెల్పు బాట యీ సాయిమాట
>
> — బాబా

ప్రక్కనే ఉన్న ఆమెతో చెప్పి పాదరసంలాగా పాదాలు జారిపోతున్నట్లు చకచక నడిచి కార్లో వెళ్ళిపోయారు. వారి నడకను కళ్లార చూడాలేగానీ, కలాలతో వివరించలేము.

సాగనంపి అలాగే నిలుచున్నాము.

"నీవు ఎంతో పుణ్యం చేసుకున్నావు ! నిన్ను ఆశీర్వదించటానికి మాత్రమే బాబాగారు ఇంత దూరం వచ్చినట్లుంది" అన్నారు డా॥ లక్ష్మి నన్ను చూస్తూ. ఆమె నేత్రాలు ఆనందరసాశ్రయమయ్యాయి. "బాబా గారు కారు దిగి వచ్చారు. ఒక్క ఉదుటున లేచి వారి వెంట నడిచాను. ఆ వికెట్ గేట్ దగ్గర ఆగారు. వారు ఆగటం నీవు రావటం ఏమాత్రం జాప్యం లేని సంఘటన. నిన్ను ఆశీర్వదించారు, వెళ్ళిపోయారు" అన్నారు లక్ష్మి.

ఉన్నవారి నుండి దానం కోరేవాడు మానవుడు. లేని వారినుండి దానం కోరేవాడు భగవంతుడు. లేనివాడు ఏమి ఈయగలడు ? అదే విచిత్రమైన విషయం ! నిజానికి మానవులనుండి ఏ వస్తువును ఆయన కోరడు, ఒక్క మనస్సు తప్ప ! ఎవడు తన మనస్సును భగవంతునికి దానం లేక త్యాగం చెయ్యగలడో వాడే భగవంతునికి ప్రియతముడు, ధన్యుడు. కారణం అది ఇక ఎన్ని పెడ తలపుల డొంకలలో విహరించిన విహ్వలించిన, చివరికి ప్రశాంతమైన తావుకు త్రోవచూపే పూర్తి బాధ్యత వాడే వహిస్తున్నాడు గనుక. ఆనాడు లక్ష్మీనరసారెడ్డి గారింట్లోనే బాబాగారికి నా మనస్సును త్యాగం చేశాను. ఆ త్యాగానికి మెచ్చే నన్నాశీర్వదించటానికి ఈనాడు బాబా నా చెంతకు వచ్చారు, లేదా నన్ను పిలిపించారు, అన్న సత్యాన్ని నేను సంపూర్ణంగా విశ్వసించాను.

ఆనాటినుంచి నన్ను గూర్చి నేను ఆలోచించటం పూర్తిగ విరమించాననే అనుకుంటాను. కారణం, నన్ను గూర్చిన తలపోతలు నాలో ఉన్నంతకాలం భగవంతుని నేను సమీపించలేను. ఇతరుల గూర్చి, వారి అవసరాల గూర్చి, వారికి జరగవలసిన సేవగూర్చి ఆలోచించినప్పుడే "వాడు" క్రమేపి దగ్గరౌతాడు. దీవినే 'పరతత్త్వం' అంటారు. ఈ ఆవరణలోనే ఆయన వెల్లివిరిసి ఉంటాడు.



# కాళియ మర్దనము - అంతరార్థము

-విజయలక్ష్మి పండిట్

" యుగ ధర్మ పద్ధతుల్ విగళితమై యుంట
నయమార్గమున ద్రిప్పి నడుపుకొఅకు,
లోకంబులెల్ల కల్లోలమై చెడియుంట
నిష్కల్మషము చేసి నెగడుకొఅకు,
సన్మార్గ వర్తనుల్ క్రుంగి దీనత నుంట
సాధు సంరక్షణ సలుపుకొఅకు
కాలసందిగ్ధ విగ్రహ సూక్తులై చెడియుంట
భాష్యార్థ గోప్యముల్ పలుకు కొఅకు
త్రేత నొసగిన కోర్కెల తీర్చుకొఅకు
దుష్ట భరము బాపి భూదేవి మనుపుకొఅకు
అవతరించెను అచ్యుతుఁ డవని యందు
వాసుదేవాఖ్య శ్రీసాయి వసుధ శౌరి "

అని భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు తమ దివ్యావతార ప్రణాళికను స్పష్టము చేసినారు. కాలసందిగ్ధ విగ్రహ సూక్తులై చెడియున్న ప్రజావళికి భాష్యార్థ గోప్యములు పలుకుట శ్రీ సత్యసాయి అవతార కార్యక్రమములో నొక ప్రధానాంశము.

సాక్షాత్తు భగవంతుని యుచ్ఛ్వాసనిశ్వాస స్వరూపములుగను, అపౌరుషేయములుగను భావింపబడు వేదముల యెడ పూజ్యభావము లేక, వానినర్థము చేసికొనలేక, " ఆఁ వేదముల యందేమున్నదని పెదవి విరుచు వారెందరో ఈనాడు కలరు. భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మలైన వేదశాస్త్ర ఇతిహాస పురాణములను పుక్కిటి పురాణములుగ, అభూతకల్పనలుగ కొందరు భావింతురనుటయు అతిశయోక్తి కాదు. ఇందులకు కారణమును లేకపోలేదు " భారతీయ విజ్ఞాన సర్వస్వములనదగిన ఈ గ్రంథములకు నానార్థములు కల్పించి, యదార్థమును విస్మరించి, అనర్థములనే స్వీకరించి వ్యాఖ్యానము సలుపు వారున్నంతవరకు దుస్థితి నుండి మానవాళికి విముక్తి లేద " ని భగవాన్ పలుకుచుందురు. ప్రతి పండితుడును తన మనోభావముల కనుగుణముగ, తనకు తోచినట్లుగ తానీ పవిత్ర గ్రంథములను వ్యాఖ్యానించుట నేడు జరుగుచున్నది. ఒక పర్యాయము భగవాన్ బాబావారే " పవిత్ర చరిత్రలు, కావ్యములు అనేక అంతరార్థములను అందిస్తూవచ్చాయి. నైతికమైన, ధార్మికమైన, భౌతికమైన ఆదర్శాలను, పవిత్రతనే బోధించాయి. 'ముండే ముండే మతిర్భిన్నా ' అన్నట్లు ఒక్కొక్కరి తల, తలంపులు, ఆశయాలు వేరుగా ఉంటున్నవి. వారి వారి విశ్వాసములను, భావములను, సంకల్పములను పురస్కరించుకొని అవి వారి వారికి అట్టి అర్థములనందిస్తూవచ్చాయి. వాల్మీకి, వ్యాసాది ఋషులు కూడ తమ తమ భావములను, ఆదర్శాలను, అనుభవాలను పురస్కరించుకొనియే గ్రంథములు లిఖించినారు. తమ అనుభవాలను, ఆదర్శాలను ఆ చరిత్రల యందు ఇముడ్చుతూవచ్చారు. ప్రకృతి స్వభావమే ద్వైతము. అందరి తత్త్వమూ ఒకటిగా ఉండదు కనుక ఇందులో సమత్వము కాని, ఏకార్థము కాని రావటానికి వీలులేదు " అన్నారు

(21-4-'89)

సంకేతార్థ ప్రధానములు, సందేశాత్మకములైన పురాతన గ్రంథముల నందరును ఒకే విధముగ నర్థము చేసికొనలేకపోవుటకిదియే కారణము ' హరి ' యను పదమునకు గల నానార్థములలో ' విష్ణువు ' అను నర్థమును వదలి "కప్ప" నో, "కోతి" నో గ్రహించి

నట్లు కొందరు ప్రాచీన గ్రంథములకు వ్యాఖ్యానములు చేయుచుందురు. కనుకనే ఆంధ్రసారస్వతోద్యానమున "రామాయణ విష వృక్షములు" వెలసినవి "భాగవత విష సర్పములు" విచ్చలవిడిగా సంచరించుచున్నవి. సమర్థులైనవారు పూనుకొని వివరించునంతవరకు, సామాన్యులకందు నిక్షిప్తములైన అంతరార్థములంతపట్టవు. అట్టి గోప్యములగు అర్థములను వెలికి పండిత పామర మనోరంజకముగ, ఆబాలగోపాలము అర్థము చేసికొనగలుగునట్లుగ వివరించుట తమ యవతార కార్యక్రమములలో నొకటిగ స్వామి స్వీకరించినారు. సృష్టి స్థితి లయ కారకుడైన పరమాత్ముడే ఇట్టి మహా కార్యమును చేపట్టుట మన పూర్వపుణ్య విశేషమేకదా! అంతరార్థములను వివరించుటయే కాదు. అందుకొన గలిగిన వారికి స్వామి ప్రతి పలుకూ ఒక వేదమే ప్రతి కదలిక ఒక సందేశమే.

భగవాన్ వివరించిన ఇట్టి అంతరార్థములు అద్భుత చరిత్రలు లెక్కకు మిక్కిలిగ కలవు. అందు మచ్చున కొకటిగ 'కాళియ మర్దనము'ను గైకొందుము. శ్రీకృష్ణుడు కాళియ మర్దనము గావించుట జగమెరిగిన సత్యము. అది శ్రీకృష్ణావతార కార్యక్రమములో నొకటి యగు దుష్టశిక్షణగనే పలువురు తలంతురు. అందు దుష్టశిక్షణయే గాక మరియొక అర్థమును కలదు. భగవంతుడు ఒకానొక ఋషికిచ్చిన వాగ్దానమును నెరవేర్చుటయే ఈ కాళియ మర్దనము వెనుకనున్న రహస్యము. భారత భాగవతములీ వృత్తాంతమును వివరింపలేదు. గరుడ భీతిచే కాళియుడు కాళిందిమడుగున నివాసమేర్పరచుకొనినాడు పన్నాగములకును, పక్షీంద్రునకును జన్మతః వైరమున్నది. తత్కారణమున భారతమిట్లు చెప్పుచున్నది.

కశ్యప్రజాపతి సతులైన వినతా కద్రువలు సంతానార్థులై అనేక సహస్రవర్షములు కశ్యపునారాధింపగా నాతడు ప్రసన్నుడై కోరిన వరములను వేడుమనినాడు. అనలతేజులు, దీర్ఘదేహులు, వినుత సత్త్వులైన కొమరులు వేవురను కద్రువ కోరినది. వారి కంటె అధిక బలాఢ్యులను, భుజవీర్యవంతులైన పుత్రుల నిరువురను వినత కోరుకొనినది. కశ్యపుడు వారు కోరిన వరములనొసగి, గర్భములను చక్కగా పరిరక్షింపుమని పంపినాడు. కొంతకాలమునకు వారి గర్భముల నుండి అండములు వెలువడినవి. వానిని ఘృతకుండములలో నుంచి వారలు రక్షించుచుండిరి. ఐను వందల సంవత్సరములకు కద్రువ అండములువిసి, అందుండి శేష, వాసుకి, కాళీయాది సర్పములుద్భవించినవి. వినత తన గర్భాండములనుండి తనయులు వెలువడనందులకు చింతిల్లి ఒక అండమును పగులగొట్టినది. అందుండి అర్ధదేహుడైన అరుణుడు వెడలి వచ్చి "సవతిపై మత్సరముతో నా యీ దేహమును సంపూర్ణముగ నేర్పడువరకు నిలువలేక అండమును పగులగొట్టినందులకు ఆ సవతికే నీవు దాసివగుము. రెండవ యండము తనంత తాను పగులువరకు వేచియుండుము. అందుండి వెలువడిన తనయుడు నీ దాస్యముమ బాపున" ని పలికి మింటికెగసి సూర్య రథసారథియైనాడు.

పిమ్మట వినతా కద్రువ లొకనాడు వినోదార్థమై సముద్రతీరమున విహరించుచు ఉచ్చైశ్రవమను దేవతాశ్వమును గాంచిరి. కద్రువ వినతతో "ఆ యశ్వమును చూచితివే! పాల నురగవలె తెల్లనైనను దాని వాలప్రదేశము నల్లగా నున్నది!" అని పలికినది. అందులకు వినత, "అక్కా! నీవే కన్నులతో చూచితివో కాని ఆ యశ్వరాజమూర్తి మహాపురుష కీర్తివలె అతి నిర్మలమైయున్న" దనెను. కద్రువ రోషముతో "ఆ యశ్వవాలమున నలుపుండిన నీవు నాకు దాసి

వగుము నలుపు లేకుండిన నేను నీకు దాసినయ్యెద" నని పందెము పెట్టినవి. వినత 'సమీపమునకుపోయి చూతమ'న్నను, కద్రువ ఆమె పలుకులు సరకుసేయక ప్రొద్దుపోవుచున్నదని గృహమునకు కొనిపోయినది

నాటిరాత్రి కద్రువ తన కొడుకులకు జరిగినదంతయు తెలిపి, "ఆ యశ్వవాలమును నలుపు చేయకుండిన నేను వినతకు దాసినగుదును మీలో నెవరైన కామరూపమును ధరించి ఆ తురగపు వాలమున వ్రేలాడి నామాట నెగ్గింపుమని కోరినది. అట్టి అధర్మకార్యమున కెవ్వరును అంగీకరింపకపోవుటచే కద్రువ కోపించి వారలను శపించినది. కర్కోటకుడనువాడు ఇంచుకయైనను పాపభీతిలేక పాపభీతిచే తల్లి యాజ్ఞను నెరవేర్చినాడు. ఫలితముగ వినత ఓడిపోయి సవతికి దాసియైనది. అనేకవిధములుగ కద్రువకు సేవలొనరించుచు కష్టములనుభవించుచుండినది. ఐదువందల సంవత్సరములు గడచిన పిమ్మట రెండవ యండము పగిలి, అందుండి మహాబలసమన్వితుడైన గరుడుడుదయించినాడు తల్లితో బాటుగా తానును నాగులనెత్తికొని త్రిప్పుచు, కద్రువ పంచిన పనులెల్ల చేయుచుండినారు. కొంతకాలమునకు గరుడుడు తమ దాస్యమునకు కారణమును తల్లి వలన నెఱిగి, సర్పములను సమీపించి, "మా దాస్యవిముక్తికి మీరేది కోరిన అది తెచ్చియిత్తు" నని పలికినాడు. వార 'మృతమును తెచ్చియిమ్మ'ని కోరిరి.

గరుడుడంతట తల్లి యనుమతిని పొంది, తండ్రిని దర్శించి, యాతని ఆశీర్వాదములంది, స్వర్గమునకు బోయి అమృతరక్షకులతో యుద్ధముచేసి, వారలనోడించి యమృతభాండమును తీసికొనిబయలుదేరినాడు. అమృతము చేజిక్కినను ఆస్వాదింపని వాని సౌశీల్యమునకు మెచ్చిన శ్రీమన్నారాయణుడాతనికి అజరామరత్వమును ప్రసాదించి, "నాకు వాహనమవై, ధ్వజమవై వర్తిల్లు" మని ఆశీర్వదించినాడు. దేవేంద్రుడాతని పరాక్రమమునకు మెచ్చి వరము కోరుమనినాడు తమకు కీడును తలపెట్టి, తమచే ఊడిగము చేయించుకొనిన సర్పములు తన కాహారము కావలెనని కోరి, ఇంద్రుని వలన సర్పభోజనత్వమును వరముగా పడసినాడు ఖగేంద్రుడు - ఇది మహాభారతమునయున్న కాళియ, గరుడుల గాథ. ఆ తదుపరి వృత్తాంతమును మహాభాగవతము కొంత వివరించినది—

## బుద్ధి

బుద్ధి నాలుగు రకాలు. 1, స్వార్థబుద్ధి. 2. స్వార్థ పరార్థబుద్ధి. 3. పరార్థబుద్ధి. 4. నిస్స్వార్థబుద్ధి. స్వార్థ బుద్ధి అంటే తన ఆనందమే కాని పరుల ఆనందం గుర్తింపకుండుట. ఇది సామాన్యులలో అధికంగా కనిపిస్తుంది. స్వార్థ పరార్థ బుద్ధి అంటే తన సుఖంతో పాటు పరుల సుఖం కూడా విచారించటం. ఇది సామాన్య మానవత్వం పరార్థ బుద్ధి అంటే తాను ఏమి ఆశిస్తాడో పరులకు కూడా అదే జరగాలని అనుకోవటం నిస్స్వార్థ బుద్ధి అంటే స్వార్థం విసర్జించి తాము భగవంతుని దూతలముగా భావించి లోక సేవ చేయుట.

— బాబా

సర్పభీరువులైన జనులందరు వివిధములైన భక్ష్యములను మాసమునకొక పర్యాయము వృక్షమూలములందు పెట్టుచుండిరట. గరుడుడు తమ్ము చంపకుండనుండుటకు సర్పములన్నియు ఆ భక్ష్యములను పక్షిరాజునకు సమర్పించుచుండెనట. కాళియుడు మాత్రము పక్షీంద్రుని పాల పహరించుటయేగాక తన పాలుకూడ ఈయక ఆరగించుచుండెనట ఖగరాజందులకు కోపించి కాళియుని

సంహరించెదనని రాగా, సర్పకులాంతకుడైన గరుడుని చూచియు ఇంచుకయైన వెఱపులేక, పడగలు విచ్చి, కన్నుల విషాగ్నికణములు రాలగా, భయంకరముగ నాలుకలను త్రిప్పుచు, నిట్టూర్పులలో కార్చిచ్చు లెగయుచుండ కాళియుడాతని కఱచెనట. వెంటనే పన్నగేంద్రుని పడగలు విరుగునట్లు, నోట విషము క్రక్కునట్లు గరుడు దాతనినేసెనట. అట్లు వ్రేటువడిన కాళియుడు యమునా హ్రదమును చొచ్చి తలదాచుకొనినాడు. సౌభరియను ఋషి శాపమున గరుడుడా మడుగున ప్రవేశించడని కాళియుడొక్కడే ఎఱుగునట కాళియుడటుల మడుగున నివసించుటచే అందలి జలమంతయు విషపూరితమైనది. పశుపక్షి మృగాదులకేగాక, మానవులకును అది ప్రాణసంకటమై పరిణమించినది. కాన శ్రీకృష్ణుడా మడుగు నందలి జలమును విషరహితమును, పవిత్రమును గావించుటకై కాళియమర్దనము సలిపినాడు.

మహాభాగవతము నందీఘట్టము విపులముగ వర్ణితమైనది. భారత, భాగవతములింత మాత్రమే కాళియ, గరుడులను గూర్చి తెలుపుచున్నవి. శ్రీకృష్ణుని కాళియుని పడగలపై నాట్యమాడుటకుగల నిజమైన కారణమును, కాళియు పూర్వజన్మ వృత్తాంతమును ఒకానొక దివ్యోపన్యాసములో భగవాన్ బాబావారిట్లు తెలిపినారు "ఈ కాళియుడు వేదశిరుడను మహాతపస్వి. గొప్ప జ్ఞాని. అతడు వింధ్యపర్వతముపై తపస్సుకు వెళ్లాడు. తపస్సు ప్రారంభించాడు. అశ్వశిరుడనే మరొక తపస్వి ఆ పర్వతం పైకి వచ్చాడు ఇరువురూ ప్రక్క ప్రక్కన తపస్సుకు కూర్చున్నారు. వేదశిరుడు లేచి ఉగ్రుడై, "నా సమీపములో తపస్సు చేయడానికి నీకధికారంలేదు, తక్షణమే నీవీ స్థానం వదలిపెట్టి పొమ్మ"న్నాడు. అశ్వశిరుడు కూడ మహాజ్ఞాని. అతడు లేచి, "ఋషీ ! నన్నిక్కడనుండి వెళ్ళమనడానికి నీకధికారం లేదు. ఇది నీసొత్తుకాదు. ప్రాచీన కాలంనుండి అనేకమంది ఋషులిక్కడ తపస్సాచరించి, తమ దివ్యత్వాన్ని సాక్షాత్కరింపజేసికొని పోయినారు. ఇది నీది, నాది కాదు. భగవంతుని వరప్రసాదము. నాకు నీవీ విధంగా చెప్పడానికి వీలుకాదు" అన్నాడు.

ఒకరికొకరు ఈవిధంగా వాదోపవాదములు పెంచుకోవడంతో అది మహాఘోరమైన యుద్ధంగా తయారయింది. అప్పుడక్కడ భగవంతుడు ప్రత్యక్షమై "నాయనా ! మీరు చేయునది "తపస్సు" మీ హృదయాలంతా "తమస్సు"లో మునిగి ఉన్నాయి. రాగద్వేషములను దూరం చేయడమే తపస్సుకు సరియైన పునాది ( Proper Foundation ). మీలో ఉండిన యీ దుర్భావాలు దూరం చేసుకున్నప్పుడే అది తపస్సుకు సరియైన స్థానం (Proper Seat) గా ఏర్పడుతుంది. బాహ్యసంబంధమైన వృత్తులను అరికట్టుకొనక, ఇంద్రియములను వశము చేసికొనక తపస్సుచేసి ప్రయోజనం లేదు బాహ్యసంబంధమైన వృత్తులన్నీ ప్రాకృత జీవితానికి మాత్రమే దేహము అనిత్యము, ఇంద్రియములు అసత్యము. రోగమయమైనవి ఈ ఇంద్రియములు. ఇలాంటి వానితో నిత్యసత్యమైన ఆత్మను పొందడానికి సాధ్యమవుతుందా ? ఇంద్రియాలను నిగ్రహించుకొని, మనస్సు యొక్క తత్త్వాన్ని గుర్తించుకొని, ఆత్మతత్త్వాన్ని అర్థం చేసుకొని, దివ్యత్వాన్ని పొందవలసినవారు సర్వమును త్యాగముచేసి వింధ్య పర్వతముపై స్థానము నిమిత్తం పోరాడుతూ కూర్చున్నారు. దోషము, ద్వేషము మనస్సునందుండకూడదు. ద్వేషరహితమైన హృదయాన్ని అభివృద్ధిపరచుకున్నప్పుడే మీకు తపస్సుచేసే అధికారము. ఇది నాకు ఇష్టము. ఇది నాకు అనిష్టము అనే బేధభావములుండకూడదు" అన్నాడు. ఇరువురు తమ దోషాన్నిగుర్తించి వచ్చి పాదాలపైన పడ్డారు. వేదశిరుని తలపైన భగవంతుడు పాదంపెట్టి, "నాయనా ! ఈ దోషాన్ని నేను,

నీ మరుజన్మలో పరిహారం కావిస్తా" నని చెప్పాడు. అతడే కాళీయుడుగా పుట్టాడు. అశ్వశిరునితో, "నాయనా! ఈవిధమైన క్రోధం నీకు పనికిరాదు జ్ఞానవైరాగ్యము లనే రెక్కలతో నీవు జీవించాలి వైరాగ్యము లేకుండా, జ్ఞానమును గుర్తించకుండా దివ్యత్వాన్ని అర్థం చేసుకో లేవు నీవు ఇంకొక జన్మలో నా వాహనంగా ఉంటుండు. ఈపాపమును నేను నిర్మూలం గావిస్తా"నన్నాడు అతడే గరుడుడుగా పుట్టాడు వేదశిరుడు – కాళీయుడు : అశ్వశిరుడు–గరుడుడు (17-4-89)

రాగద్వేషములకు లోనుకావటంచేతనే అశ్వశిరునకూ వేదశిరునకు తపస్సు భంగమైపోయింది సర్వసంగ పరిత్యాగులు, మహా జ్ఞానసంపన్నులైన ఋషులకే ఏ కొంచెమో రాగద్వేషములు శేషించి ఉండటంచేత మరల జన్మనెత్తవలసివచ్చినది ఋషులిరువురిలో వేదశిరుడే మొదట కయ్యానికి కాలుదువ్వాడు. క్రోధానికి లోనై అశ్వశిరుని ఆవలకు పొమ్మన్న వేదశిరుడు కాళీయుడిగా జన్మించాడు అతనికి ఒకే ఒక పర్యాయం పరమాత్ముని పాద స్పర్శ లభించినది. అతని జన్మ తరించినది. అశ్వశిరుడు ముందుగా కలహించలేదు వేదశిరుడు పలికిన పలుకులకు మాత్రమే అతడు సమాధానమిచ్చినాడు. అతనిలో దోషం తక్కువ స్థాయిలో ఉండటం చేతనే భగవదనుగ్రహమతనికి అధికంగా లభించినది. శ్రీమన్నారాయణుని వాహనముగా మారి చిరకాలమాస్వామిని సేవించుకునే భాగ్యం పొందగలిగినాడు ఋషులంతటివారికే పునర్జన్మ తప్ప లేదు అభిమాన మమకారములలో చిక్కిన మనవంటి మానవులకు సంగ త్యాగము గావించి తపస్సుచేయవలెనను కాంక్ష గాని ఆత్మసాక్షాత్కారమును పొందవలెనను ఆసక్తిగాని కలుగుటయే దుర్లభము. ఇక మనవంటి వారెన్ని జన్మలెత్తవలయునో కదా ! " ఏ సాధనకైనా చిత్తశుద్ధి ప్రధానం. చిత్తశుద్ధి లేనిదే జ్ఞానసిద్ధి కలుగదు " అంటారు స్వామి.

" శ్రీకృష్ణావతారము ఈ విధంగా ప్రతి వ్యక్తికీ పూర్వజన్మ వృత్తాన్ని నిరూపించింది పూర్వ తత్వాన్ని, ప్రస్తుత తత్వాన్ని సమన్వయం గావించిన దొక్క కృష్ణావతారమే " అన్నారు స్వామి.

భగవాన్ బాబావారు తమ దివ్యోపన్యాసములలో ఇట్టి విషయముల నెన్నింటినో సెలవిచ్చుచుందురు వానిలో కొన్నింటికి ఏ మారుమూల గ్రంథములలోనో, పురాణములలోనో ఆధారములుండవచ్చును కొన్నింటిని

దిగినప్పుడే గదా ! తెలియును లోతెంతో
దిగకుండ లోతెట్లు, తెలియవచ్చు
బాగుగా తెలిసిన పరవిమర్శనమును
చేసిన, యొకవేళ చేయవచ్చు
ఆ వ్యక్తిని గురించి, అణుమాత్రమైనను
తెలియలేనప్పుడు పలుకతగునె ?
సత్యసాయిని గూర్చి చాలామందిరీతి
పరమ మూర్ఖులుగను వదరు చంద్రు
ఏనుగును జూచి పలుకుక్క లేచ్చినట్లు
ఒకరి అభ్యున్నతిని చూచి యోర్వలేరు
సత్యమేదియో, గానక నిత్యమిట్లు
మందమతులార ! తగునయ్య ! నిందజేయ ?

– మల్కారి ఆనందరావు

స్వామివారే " ఇది ఏ గ్రంథంలోనూ లేదు. కనుకనే నేను చెప్పవలసివచ్చినది " అంటారు. కనుక భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారిని అవతారమూర్తిగా విశ్వసించి సాయిని తమ హృదయస్థాయిగా నిలుపుకొని, సాయి బాటలో జీవన ప్రస్థానం సలిపేవారందరూ నిత్యము శ్రీ సత్యసాయి సాహిత్యాన్ని పఠించటము భావి భారతోద్ధారకులచే పఠింపజేయడము అత్యావసరం.

# శ్రీ సత్యసాయి శకమునకు - వైతాళికులు

——— ఎన్. బి. ఎస్. రామారావు

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు "వసుధైక కుటుంబము" అను పేర ప్రపంచములో గల సమస్త దేశ ప్రజలను జాతి మత కుల భాషా వివక్షణ లేకుండా, సుఖశాంతులతో అందరూ కలిసిమెలసి జీవించునట్లు తన ప్రేమ ద్వారా "సత్యయుగమును" మనకు ప్రసాదించుటకై అవతరించిరి సమకాలికులెందరో, కోట్లాది ప్రజలు స్వామిని అవతారపురుషుడుగా అంగీకరించి వారి బోధనలను అనుసరించుచున్నారు అవతార పురుషులు తాము ఈజీవితములో సాధించవలసిన విషయములను ముందే నిర్ణయించుకొని, అందుకవసరమైన వ్యక్తులను సమకాలికులుగా తీసికొనివచ్చి ఒక ప్రణాళిక ప్రకారము వారి కర్తవ్యమును నిర్వహించెదరు.

వచ్చే 2000 సం॥ నుంచీ "సత్యసాయి శకము" ఆరంభము కాబోవుచున్నది సమస్త దేశములు స్వామి ఆజ్ఞగుజాడలలో సత్య ధర్మ శాంతి ప్రేమలను మానవతావిలువలు గల దివ్య జీవనము గడుపుకాల మాసన్నము కాబోవుచున్నది. స్వామి తన కార్యక్రమమును, అవతార లక్ష్యమును కొందరు సమకాలికులైన వ్యక్తుల ద్వారా ప్రపంచమునకు అందించెదరు. అట్టి వారిలో ముఖ్యులైనవారు, రాబోయే సత్యసాయి శకమునకు వైతాళికులు అనదగినవారు కొందరు గలరు. వారి అనుభవములను స్వామివారి ద్వారా తన అవతార కార్యక్రమముల నెట్లు కొనసాగించుకొనుచున్నదీ వివరములు తెలిసికొందము. ఈ కలియుగములో మానవుల హృదయములలో గల చెడు బుద్ధులను త్రుంచి వారిలో ధర్మాచరణ పెంచుట ద్వారా, నేటి మానవులలో ఒక పెద్ద ఆధ్యాత్మికాభివృద్ధి మార్పును తీసికొని వచ్చుచున్నానని స్వామి అనేకసార్లు తమ ఉపన్యాసములలో కూడ పేర్కొనిరి. అట్లు స్వామిచే మార్పు చేయబడి, తదుపరి స్వామి యొక్క ప్రేమ వారిద్వారా ఇతరుల కందింపబడుచు, స్వామి అవతార కార్యక్రమములలో పనిముట్లుగా వ్యవహరింపబడిన ఇద్దరు పాశ్చాత్య దేశములవారిగురించి ఇపుడు తెలిసికొందము.

1 శ్రీ ఆర్తాంగ్ జుమ్‌సాయి. 2. శ్రీ విక్టరు కానూ

శ్రీ ఆర్తాంగ్ జుమ్‌సాయిగారు లండన్ యూనివర్శిటీలో సైన్సులో డాక్టరేట్ పట్టా పొంది, థాయ్‌లాండులోని సైన్సు & టెక్నాలజీ రీసెర్చి సంస్థకు డైరక్టరుగా పని చేయుచూ ప్రస్తుతము 12 తూర్పు దేశము (బ్యాంకాక్, ఫిజీ మొ॥) లలో గల సత్యసాయి సంస్థలకు అధిపతిగా వ్యవహరించుచున్నారు.

1945 సం॥ ప్రాంతములో రెండవ ప్రపంచయుద్ధము జరుగుచుండగా బ్యాంకాక్‌లో గల మిలటరీ బ్యారెక్స్‌లో ఒక ఇంటిముందు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ప్రత్యక్షమై, ఆ యింటిలోని గృహిణిని పిలచి, కొంత విభూతి తమ దివ్య హస్తములతో సృష్టించి ఇచ్చి అది వారింటిపై జల్లుకొనమని వారి భాషలో చెప్పి అదృశ్యులైరి. ఆమె ఆ విభూతి చూసి (White Sand) తెల్లని ఇసుక అనుకొని, ఏమైననేమి అని ఇంటిపై జల్లెను. మరి కొద్ది నిముషములకే జపానువారి యుద్ధవిమానములు వచ్చి ఆ ప్రాంతముపై బాంబులదాడి చేయగా వీరిల్లు తప్ప మిగతా ఇండ్లన్నియు నాశనమయ్యెను. ఆ తరువాత ఆ యింటివారికి "ఆర్తాంగ్ జుమ్‌సాయి" అను అబ్బాయి పుట్టెను. ఆతను చిన్నతనము నుంచి చాలా కొంటెవాడై, అల్లరిచిల్లరిగా సంచరించుచూ పాఠశాలలందు తోటి విద్యార్థులందరినీ చితకబాదుచుండెడివాడు.



మిగతా పిల్లలందరూ గొడవచేయుటచే అతని తల్లిదండ్రులు "అర్తాంగ్" ను ఒక (Residential School) హాస్టలు వసతి గల పాఠశాలలో జేర్చిరి. ఒకనాడు అతడు మిగతా పిల్లలతో కలిసి నిద్రించుచుండగా రాత్రి 12 గం॥ ప్రాంతములో అతనికి మెలకువ వచ్చి అ...ర్తాంగ్: అర్తాంగ్: అర్తాంగ్ ఎందుకిట్లు చేయుచుంటివి? "Why are you doing this? అని ఇంగ్లీషులో వినిపించెను అతను కళ్ళు తెరచి చూడగనే ఆ హాలు అంతయూ బంగారురంగు దివ్యకాంతులతో మెరయుచు కన్పించెను. ఇది చూసి అతడు ఇదేదో దెయ్యమై యుండునని తలచి భయపడి దుప్పటి ముసుగుపెట్టివేసి పరుండెను మరునాడు రాత్రి ఆ మరునాడు (3 వ రోజు) కూడా అదే విధముగా జరిగెను. మూడవనాడతడు ధైర్యముచేసి మిత్రులను లేపి చెప్పగా వారిది గమనించి, ఇదేదో దైవశక్తియని, నీ గురువు మాటలే అయి వుండవచ్చని సలహానొసంగిరి అంతే! ఆ నాటినుండి అతనిలో గొప్ప మార్పువచ్చెను. తోటివారిని కొట్టుట మానివేసెను. దైవముపై మనస్సు మరలెను చక్కని విద్యాబుద్ధులు గలవాడై భారత దేశములో అవతారపురుషులుద్భవించిరని తెలిసికొని, వివేకానంద, రామకృష్ణ పరమహంస మొ॥ వారి జీవిత చరిత్రలు తెప్పించుకొని చదువుట మొదలిడెను. అతనిలో దైవమును తెలిసికొనవలెనని దృఢమైన సంకల్పము కలిగెను. ఆనాటినుండి అతడు సరళ, సాధు స్వభావముగలవాడై మంచి విద్యావంతుడయ్యెను 26 స॥ ప్రాయములోనే ఆయన ట్రినేట్ కాలేజి, క్రేమ్ బ్రిడ్జి యూనివర్శిటీ లండన్‌లో సైన్సులో డాక్టరేట్ పట్టా తీసికొని, థాయ్‌లెండ్‌లో అనేక మంత్రులకు సలహాదారుగా, విద్యాశాఖలో హౌస్ కమిటీ మెంబరుగా, స్పేస్ రీసెర్చ్ సెంటరుకి డైరెక్టరుగా నియమితుడయ్యెను.

ఇట్లుండగా 1983 సం॥లో అమెరికాలోని 'NASA'- రాకెట్లు ఉపగ్రహముల పైకి ప్రయోగించు సంస్థవారు తమరికి ఒక ప్రత్యేకమైన రాకెట్టును తయారుజేయగల "సైంటిస్టు" కావలెనని అన్ని దేశములందు ప్రకటన విడుదల చేసిరి. ఆ ప్రకటననుసరించి ఈయనకూడా తన దరఖాస్తును దాఖలు చేసెను

## గైడ్ పోస్ట్ (Guide Post)

అధ్యాపకులు దేశమునకు ఆదర్శవంతమైన జ్యోతులు. ఒక విద్యార్థి చెడితే కేవలం అతను మాత్రమే చెడుతాడు. ఒక అధ్యాపకుడు చెడితే అనేకమంది విద్యార్థులు చెడటానికి అవకాశముంటుంది. కనుక అధ్యాపకులు గైడ్‌పోస్ట్ (Guide Post) వంటివారు. కనుక విద్యార్థుల అభివృద్ధినీ, దేశాభివృద్ధినీ సమాజ క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని అధ్యాపకులు ప్రవర్తించాలి. ఈ విధమైన ఉన్నత భావముల చేత, ఉత్తమమైన అభిప్రాయముల చేత మన గురుత్వాన్ని లోకానికి చాటుటకు పూనుకోవాలి. విద్యారంగం సంస్కరించబడాలంటే మొట్టమొదట అధ్యాపకులు సంస్కరించబడాలి.

– బాబా

అమెరికన్లు "మార్సు" (కుజగ్రహము) పైకి మనుషులులేని ఒక రాకెట్‌ను ప్రయోగించదలచిరి. కానీ ఆ రాకెట్ కుజగ్రహ ఉపరితలముపైగల ఆకర్షణ శక్తియొక్క పరిధిలో ప్రవేశించగనే మండిపోవునని అనుమానించిరి కుజగ్రహము భూమికి చాలాదూర

మందు గలదు. భూమినుండి కుజగ్రహము వరకూ ఈ రాకెట్ చాలా వేగముగా వెళ్ళవలెను. కుజగ్రహ ఆకర్షణ పరిధిలో ప్రవేశించగనే నెమ్మదిగా దిగి, అచటగల మట్టిని సేకరించి భూమికి తిరిగి తీసుకొని రావలెను. మనుష్యులు లేకుండగనే రాకెట్ యంత్ర శక్తితోనే పనిచేయవలయును భూమ్యాకర్షణకంటే, కుజగ్రహ ఆకర్షణశక్తి పది రెట్లధికమగుటచే ఇట్టి రాకెట్‌ను తయారుచేయుట అమెరికన్లకు కూడా సాధ్యపడలేదు. అట్టి రాకెట్ మోడల్‌ను ముందుగా లేబరేటరీ తయారుచేసి చూపవలసినదిగా, అందుకవసరమగు ఖర్చంతయూ 'NASA' భరించునవియూ ప్రకటనలో తెలియజేసిరి. అట్టి పరీక్షలో శ్రీ " ఆర్తాంగ్ జుమ్ సాయి" గారు సెలక్టు చేయబడిరి

మొదలు రాకెట్‌ను తయారుచేసి లేబరేటరీలో కృత్రిమ కుజగ్రహ ఆకర్షణశక్తి పరిధిలో ప్రయోగించగనే ఆ రాకెట్ అమెరికన్లు అనుమానించినట్టే మండిపోయి బూడిదయైపోయెను. రెండు మూడు నెలల వ్యవధిలో ఇంజనులో కొన్ని మార్పులుచేసి తిరిగి ఆర్తాంగ్ జుమ్ సాయి సైంటిస్టు రెండవ మోడల్ రాకెట్‌ను ప్రయోగించెను అదికూడా లేబరేటరీ కృత్రిమముగా కల్పించబడిన అధికమైన కుజగ్రహ ఆకర్షణశక్తి పరిధిలో ప్రవేశించుచునే మండిపోయెను. అప్పటికి 400 లక్షల అమెరికను డాలర్లు ఖర్చుచేయబడినవి. ఆర్తాంగ్ జుమ్ సాయికి మానసిక విచారమెక్కువయ్యెను. ఏమిచేయుటకు తోచుటలేదు ఆత్మహత్య చేసికొనుటకు నిర్ణయించుకొని, ఎవరికీ చెప్పకుండా దగ్గరలోగల ఒక కొండ శిఖరము నధిరోహించి, అచటనుండి క్రింద లోయలోకి దూకి మరణించుటకు ఉద్యక్తుడగుచుండగా ఆకాశములో ఒక తేజస్సు అతనికి సాక్షాత్కరించెను చెవిలో ఎవరిదో మాట వినపడెను ఆ తేజస్సులో సరైన పద్ధతిలో తయారుచేయవలసిన రాకెట్‌కు అవసరమైన ఇంజనుకు సంబంధించిన విజ్ఞాన శాస్త్ర (Scientific Equation for the Rocket Engine) సూత్రము సాక్షాత్కరించెను. విజ్ఞానవేత్త కంటె, విజ్ఞానవేత్తను సృష్టించిన దైవమే అధికమని, దైవశక్తి లేనిదే విజ్ఞానశాస్త్రమేమియూ సాధించలేదని Spirituality is greater than Science. మాటలు ఆయనకు వినపడెను వెంటనే ఆయన లేబరేటరీకి తిరిగి వెళ్ళి, తనకు సాక్షాత్కరించిన "ఈక్వేషను" ప్రకారము 11వ రాకెట్ తయారుచేసెను అది సరిగా ప్రయోగింపబడెను ఆయన కృషికి అమెరికన్లు మెచ్చుకొని, ఆ 11వ రాకెట్ ఇంజను ప్రకారము 'Life Size' పెద్ద సైజు రాకెట్ (Un manned Space Craft "Viking") "వైకింగ్" అను పేరుతో ప్రయోగించి కుజగ్రహముపైగల మట్టిని భూమికి తీసికొనరాగలిగిరి. ఈ పని చేసినందుకు అమెరికావారు శ్రీ ఆర్తాంగ్ జుమ్ సాయిగారికి 1984 సంIIలో ఇతనిని మించిన సైంటిస్టు లేడు అను (Award) అవార్డును బహూకరించిరి. ప్రపంచములోకెల్లా అది మిక్కిలి అధికమైన అవార్డు.

అది గ్రహించి ఆయన ఇంకా సైన్సును విడచిపెట్టి భగవంతుని వెదకవలెనను పట్టుదలతో తన తల్లిని తీసికొని భారతదేశమునకు వచ్చెను. ఢిల్లీలో కొందరు ఆయనకు బెంగుళూరు వెళ్ళి శ్రీ సత్యసాయి బాబావారిని దర్శించమని సలహా నొసంగిరి. ఆయన బృందావనములో స్వామి దర్శనమునకు కూర్చుండగా స్వామివారికి ఇంటర్వ్యూ నొసగి, రెండవ ప్రపంచ యుద్ధ సమయమున తాము బ్యాంకాక్ వచ్చి ఈతని తల్లికి విభూతి నొసగిన విషయము చెప్పి, ఆమె దానిని తెల్లని ఇసుక (White Sand) అనుకొనెనని కూడా చెప్పి, తన అవతార కార్యక్రమములో పాలుపంచుకొనవలసిన వ్యక్తులను కొన్ని జన్మలనుండి స్వామివారిని

తమ సమకాలికులుగా తీసికొనవచ్చుచున్నానని చెప్పి, రాకెటు ఇంజనుకు అవసరమైన (Equation) శాస్త్ర విజ్ఞాన సూత్రము నెవరు ప్రసాదించిరని ప్రశ్నించిరి. అంత "ఆర్తాంగ్ జుమ్‌సాయి" స్వామిని అవతార పురుషులుగా గుర్తించి, వారిని భగవంతునిగా అంగీకరించి సంతసించెను. స్వామి వారిని 12 తూర్పు పాశ్చాత్య దేశములలో గల సత్యసాయి సంస్థలకు అధిపతిగా నిర్ణయించి ఆయా దేశములలో విద్యావిధానమును చక్కదిద్దుమని, సత్య ధర్మ శాంతి ప్రేమలుగల మానవతా విలువలలో విద్యాభివృద్ధి చేయమనియు, ఆర్తాంగ్ తన పని కొనసాగించిన, స్వామి వారి వ్యాపారములను తీర్చిదిద్దునని సెలవిచ్చిరి. (You do my work ; I will look after your business)

ఆనాటి నుండి "ఆర్తాంగ్" అహోరాత్రులు E H V. (Education in Human Values) మానవతావిలువలు గల సాయి విద్యావిధానమును 12 దేశములలో అమలు పరచుచూ స్వామి అవతార కార్యక్రమములో ముఖ్య పనిముట్టుగా పనిచేయుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు ఆర్తాంగ్ జుమ్‌సాయిగారికి బ్యాంకాక్‌లో గల ఒక ఫ్యాక్టరీలో దొంగతనము జరుగుట ప్రారంభమయ్యెను ఆయన స్వామి కార్యక్రమములలో ఇతర దేశములందు తిరుగుచూ తన ఫ్యాక్టరీపై శ్రద్ధ వహింపలేకుండెను ఆయన ఫ్యాక్టరీ గేటులోగల సెక్యూరిటీ వాచ్‌మెన్ రాత్రులందు సెక్యూరిటీగార్డు రూములో అద్దములు గల తలుపులు వైచికొని, డ్యూటీ చేయక నిద్రించుట మొదలిడెను. ఆ గదికి అద్దపు తలుపులు మూసినపుడు (Air Tight ) లోపలికి గాలి కూడా చొరబడ వీలులేదు. ఒకనాడు 12 గం॥ ప్రాంతములో గార్డు నిద్రించుచుండగా భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ఆ గదిలో ప్రత్యక్షమై అతనిని, నిద్రనుండి లేపి, వారి భాషలో డ్యూటి చేయవలసి విధానమిది యేనా? అని మందలించిరి. మరునాడు రాత్రి వాచ్‌మెన్ తిరిగి అట్లే నిద్రించుచుండగా మళ్ళీ స్వామి అతనిని లేపి మందలించిరి స్వామిని అతడెప్పుడూ చూచి యుండలేదు. స్వామి గురించి తెలియదు గాలి కూడా దూరని ఈ గదిలోకి మనిషి ఎట్లా ప్రవేశించెను ఈ ఎఱ్ఱని అంగర్కా ధరించిన వ్యక్తి ఎవరై యుండవచ్చునని అతడు పరిపరివిధముల ఆలోచించి, ఎట్టకేలకు మరునాడు తన యజమాని 'ఆర్తాంగ్' రాగానే వారికి తన తప్పును విన్నవించి రెండు రోజుల జీతమును మినహాయించుకోమని కోరెను.

వీరిద్దరూ ఒకరితో నొకరు మాట్లాడుకొనుచూ యజమాని, ఫ్యాక్టరీకి మేనేజింగ్ డైరెక్టరూ అయిన "ఆర్తాంగ్" గారి ఆఫీసు రూము ప్రవేశించిరి ఆయన కూర్చుండుకుర్చీ వెనుకభాగములో భగవాన్ సాయిబాబా వారి పెద్ద చిత్రపటమును సెక్యూరిటీ గార్డు చూడగనే ఆశ్చర్యపడి, ఆ ఫోటోలో గల వ్యక్తియే తనకు ప్రత్యక్షమై హెచ్చరించెనని తెలిపెను.

వెంటనే ఆర్తాంగ్ జుమ్ సాయిగారు విమానములో బయలుదేరి ఇండియాకు పయనమై ప్రశాంతినిలయము చేరిరి. ఆ సమయములో పూర్ణచంద్ర హాలులో E H V సదస్సులో స్వామి ఉపన్యసించుచూ, ఇప్పుడే 'ఆర్తాంగ్ జుమ్ సాయి' వచ్చినాడని తెలిపి, ఆయనను లోపలికి పిలిపించి, వారి అనుభవమునేదైనా మాట్లాడమని చెప్పిరి ఆయన స్వామి థాయ్‌లాండ్‌లో తమ ఫ్యాక్టరీకిగల సెక్యూరిటీ గార్డు రూము తలుపులు మూసి వుండగా, లోపల నిద్రించుచున్న గార్డును లేపి "సరిగా డ్యూటీ చేయమని" మందలించిన సంగతి విన్నవించగనే స్వామి "అవును నీవు నా పని చేయుము, నేను నీ వ్యాపారమును తీర్చిదిద్దెదనని మాట ఇచ్చితిని గదా.

దొంగలు పడుచుండగా, సెక్యూరిటీ గార్డును మందలించ వలసి వచ్చుటనే నేను మా దేశము వచ్చితిన"ని స్వామి ఈ సంఘటనను నిర్ధారణ చేసిరి. ఆనాటినుండి శ్రీఆర్తాంగ్ జుమ్ సాయి (Far Eastern Countries) 12 తూర్పు పాశ్చాత్య దేశములలో సత్య ధర్మ శాంతి ప్రేమలను మానవతా విలువలను మౌలిక సూత్రములుగా గల విద్యావిధానమును చిన్న తరగతులనుండి పోస్టుగ్రాడ్యుయేట్ వరకూ వ్యాపింపజేయుచూ, స్వకార్యములనువదలి అహోరాత్రములు స్వామి కార్యక్రమమునే జేపట్టుచూ స్వామిచే అనుగ్రహింపబడిన పనిముట్టుగా జీవితమును సాగించుచున్నారు రాబోయే సత్యసాయి శకమునకు ముఖ్యవైతాళికులలో పాశ్చాత్య దేశీయులలో పేరెన్నిక గన్న విజ్ఞానవేత్త, వయస్సులో చిన్నవాడైననూ స్వామి భక్తిలో మిన్న "శ్రీ ఆర్తాంగ్ జుమ్ సాయి."

ఇక రెండవవారు శ్రీ విక్టర్ కానూ పీరు కూడనూ స్వామిచే వారి జీవిత సరళిలో మార్పు చేయబడి, ప్రస్తుతము పాశ్చాత్య దేశములలో జింబాబ్వే, లండన్ మొ॥ 12 పశ్చిమ దేశములలోగల (Far Western Countries) సత్యసాయి సంస్థలకు అధిపతులుగ రాత్రింబవళ్లు E H V. స్వామి విధానమును కొనసాగించుచూ పేరెన్నికగన్న భక్తులు.

వీరు ఆఫ్రికాలో జన్మించిరి. ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీలో M A. పట్టభద్రులై 'సిర్రాలియోన్' దేశములో హైకమీషనరుగా నియమింపబడి ఆఫ్రికానుండి గ్రేట్ బ్రిటన్ వెళ్ళి, నార్వే, డెన్మార్క్-స్వీడన్ దేశములలో ఆధ్యాత్మిక సంఘ అధినేతగానూ లండన్‌లో 8 సం॥ మెజిస్ట్రేటుగా పనిచేసెను. ప్రస్తుతము ఆయన "నాడోలా"లో నివసించుచూ, జాంబియా, ఆఫ్రికా యునైటెడ్ నేషన్స్‌లోగల విద్యాసంస్థలతో E H V. సత్యసాయి విద్యావిధానమును ప్రచారము గావించుచున్నారు వీరికి కల్గిన స్వామి అనుగ్రహము, అనుభవములు చాలా అద్భుతములు.

1974 సం॥లో భగవంతుని తెలిసికొనుటకై ఈయన తీవ్ర ఆవేదనతోనుండగా, భగవాన్ సత్యసాయి బాబా వారిని గూర్చి ఏమాత్రమూ తెలియని స్థితిలో ఒకనాడు ఈయన ఆఫ్రికాలో 'సిర్రాలియోనా' నగరములో ఒక క్లబ్‌లో సాయంసంధ్యవేళ బాగా విపరీతముగా సీసాపై సీసా బ్రాందీ త్రాగుతుండగా దూరమున చెట్టు క్రింద "స్వామి" నిలబడి తనను చూచుట గమనించెను. కానీ అప్పటికి సత్యసాయి బాబావారి గురించి, నామ రూపములైననూ తనకు తెలియకుండుటచే తనను గమనించిన వ్యక్తి ఎవరో తెలియక, తన పని తాను కానిచ్చెను. ఆ రాత్రి 10 గం॥ సమయములో అతని కొక స్వప్నమొచ్చెను ఆ కలలో ఇద్దరు రెక్కలు గల బాలురు (యక్షులు) (Angels) ఈయనను ఆకాశములో 50 వేల అడుగుల ఎత్తులో ఆఫ్రికాకు తూర్పుగా ఎగరవేసికొని వెళ్ళి విమానము దిగినట్లుగా ప్రశాంతినిలయములో తూర్పు గోపురము ముందు దింపి అదృశ్యులైరి. అది ప్రశాంతినిలయమని గాని, తాను వచ్చిన దేశము భారత దేశమనిగాని అతనికి తెలియదు. ప్రశాంత ప్రాంగణములో ప్రవేశింపగనే అక్కడ అన్ని దేశముల వారు రకరకముల భాషలు మాట్లాడుచూ కన్పించిరి. ఇది ఒక చిన్న ప్రపంచ మహాసభయా అని అతడు తలపోసెను. బాబావారు కనపడలేదు కాని ప్రశాంతిమందిరము కనపడెను. అంతలో చనిపోయిన తన తాత ముత్తాతలిద్దరూ ప్రత్యక్షమై తన స్వంత భాషయైన, ఆఫ్రికాలో మాట్లాడు "తమ్నే" అనబడు తన భాషలో "ఒరే మనవడూ వచ్చితివా! చాలా అదృష్టవంతుడివి. భగవంతుని నివాసమునకు చేరుకొంటివి" అని పల్కి మాయమైరి. అంతలో

అతనికి మెలకువ వచ్చెను. అతడు ఆఫ్రికాలో తన మంచముపైననే యుండెను. కానీ ఆ స్వప్న మహాత్య మేమిటో ఆనాటినుండీ ఆయన త్రాగుడు, చుట్ట, సిగరెట్టు మొ॥ వ్యసనములను పూర్తిగా విడచిపెట్టి భగవంతుని కై అన్వేషణ సాగించెను. రాబర్టు అనబడు క్రైస్తవ మతాధికారి ద్వారా 'యెహోవా ప్రభువే' తిరిగి సత్యసాయిగ జన్మించెనని తెలిసికొని ఆనందించి-సత్యసాయి బాబాగారిని తెలియజేయు పుస్తకములను 'రాబర్టు' గారి వద్ద సంగ్రహించెను. అందులో శ్రీ సత్యసాయిబాబావారి చిత్రము తిలకింపగనే, ఆ రోజు సాయంత్రము క్లబ్‌లో తాను బ్రాందీ త్రాగుచున్నపుడు చెట్టుక్రింద నిలబడి తనను గమనించిన వ్యక్తి ఈయనే యని - స్వామి చిత్రమును బట్టి గుర్తించి - తన తప్పుకు చాలా విచారించెను.

1974 వ సం నుండి జీవనగతిలో ధనలేశముచే ఆయనకు చాలా ఇబ్బంది కల్గి, తన నివాసము ఆఫ్రికా నుండి లండన్ మార్చివేసెను. స్వామిని పుస్తకములలో చదివి అవతార పురుషుడుగా గుర్తించి, స్వయముగా భార్యతో కలిసి ఇండియా వచ్చి సత్యసాయి భగవాన్ వారిని దర్శించవలెనని తహతహలాడెను. కానీ విమాన ప్రయాణమునకు అవసరమైన ధనమును సమకూర్చు కొనలేక 1980 సం॥ వరకు బాధపడుచునే స్వామిని కొల్చుచుండెను. 1981 సం॥ లో స్వామి ఇద్దరు ఇంగ్లీషువారి పేర్లతో 500 డాలర్ల చెక్కు ఒకటి, 250 డాలర్ల చెక్కు ఒకటి బహుమతిగా "ప్రత్యేకము ఈ ధనము ఇండియా వెళ్ళి సత్యసాయి అవతారాను దర్శించుటకే ఉపయోగించవలెను" అని చెప్పి ఉత్తరము వ్రాసి వారికి పంపించిరి. వెంటనే ఆయన సతీమణి "గెనోవావా" అను ఆమెతో కలిసి ప్రశాంతినిలయము చేరుకొని స్వామిని దర్శించెను. ప్రశాంతినిలయము చేరగనే 1974 సం॥ లో యక్షుల ఆయనను తీసికొని (ఆకాశమార్గము గుండా) వచ్చినదిక్కడికే యని గుర్తించి, ఆనందపరవశుడై పోయెను.

---

## Meditation (ధ్యానము)

'Love is Flower, Lust is Thorn but there is no flower without thorn''

ప్రేమ పుష్పం, కాంక్ష ముల్లు. అయితే ముల్లులేని గులాబీపుష్పము లేదు. ముల్లును తాకకుండా జాగ్రత్తగా ప్రేమ అనే పుష్పాన్ని కోయాలి. పుష్పము వేరు చేయడమే "చింతన" (Contemplation) చెట్టులోని సర్వభాగములూ చూచి, ఎక్కడ పుష్పమున్నదీ, ఎక్కడ ముల్లున్నదీ కనిపెట్టడమే "ఏకాగ్రత" (concentration) కోసిన పుష్పమును పరమాత్మకు అర్పించుటమే "ధ్యానము" (Meditation). అలా సమర్పించిన తరువాత ఆ పూవు పూసిన చెట్టూ లేదు పూవుకోసిన చేయిలేదు, అర్పించబడిన పూవూ లేదు. ఉన్నది ఒక్క భగవంతుడే. అంటే పరమాత్మతో అద్వైతభావాన్ని పొందావన్న మాట. అట్టి అద్వైత స్థితియే "ధ్యానము" ధ్యానించే దేహమూ, ధ్యానించే మనస్సూ, ధ్యానమూ అనే మూడు ఒక్కటిగా భాసించే స్థితిని కలిగించేది ధ్యానము. ఆ స్థితిలో సాధకునికి అంతఃశాంతి, ఆనందస్థితి లభిస్తాయి.

- బాబా

---

మొదటి ఇంటార్వ్యూలోనే స్వామి ఆయనను, "విక్టర్ ! నీ భార్య ఎక్కడ ? ఓ, అయామ్ సారీ

ఆమె నీ స్నేహితురాలు. భార్య కాదు. నేను మీ కిచట వివాహము జరిపించెదనని పలికెను", వెంటనే వారిద్దరూ లేచి, స్వామీ ! మేము పెండ్లి జరిగిన కొద్ది గంటలకే విడాకులిచ్చుకొంటిమి. కోర్టులో కేసు నడచుచున్నది మేము 10 సం॥లుగా స్నేహితులుగా ఒకే ఇంట్లో నివసించుచుంటిమిగానీ భార్యాభర్తలుగా కాదు ఈ సత్యము ప్రజలు, మా లండనులోని తోటి సహచరులకు కూడా తెలియదు. వారందరూ మేము భార్యాభర్తల మనే అనుకొనుచుంటిరి. కానీ నీవు సత్యమెరుగుటచే నీవు తప్పక భగవంతుడవే యని నేను దృఢముగా నమ్ముచున్నాను Yes. You are God. You are God. You are God. అని మూడుసార్లు పలికి సాష్టాంగ నమస్కారమొనర్చెను స్వామి సర్వజ్ఞత, దైవశక్తికి ఇంతకన్న తార్కాణమేమి కావలయును ; వారు ప్రశాంతినిలయంలో నెల రోజులు నివసించిరి. స్వామి వారము రోజుల తరువాత వారి వివాహము జరిపించి, గొప్ప అనుగ్రహమును ప్రసాదించి అనేక విషయములు వారికి ఇంటర్వ్యూలో తెలియజేసిరి వారిపుడు 12 పాశ్చాత్య దేశములలోని సత్యసాయి సంస్థలకు అధిపతిగా E H V. సాయి విద్యావిధానమును కొనసాగించుచున్నారు. E H V విద్య నేర్పుటకు 12 ఎకరముల నేలలో ఒక పాఠశాల భవనమును ఆయన ఆఫ్రికాలో కట్టించుచుండగా అచ్చటి సిమెంట్, ఇనుపతీగలు రాత్రిళ్లు దొంగలెత్తికొనిపోవుట జరిగెను ఆ సందర్భములో ఒకనాడు అచట నియమింపబడిన (Ex-Military-Man) వాచ్‌మెన్ కానూగారితో ఇట్లనెను. అమ్మ నాకు తుపాకీ కలదు. కానీ గుళ్ళు లేవు రాత్రులందు దొంగలు వేటకుక్కలను (జాగిలములు) నాపైకి ఉసికొలిపి సరుకుల నెత్తికొనిపోవుచున్నారు మీరు Bullets ఇచ్చినచో నేనా దొంగల పని పట్టెదననెను విక్టరుకానూగారు కొంత సేపు ఆలోచించి, రెండు చిన్నసైజు సత్యసాయిబాబాగారి ఫోటోలనిచ్చి, "ఇవే Bullets, తుపాకిగుళ్ళు" నీపైకి దొంగలుగాని, కుక్కలుగాని వచ్చినప్పుడు ఈ తుపాకి గుళ్ళను వారికి చూపించి, "సాయిరాం, సాయిరాం" అని శబ్దము చేయుమని ఉపదేశించెను అతడు మిలటరీలో రిటైరైన వ్యక్తి అగుటచే ఇవి తుపాకి గుళ్ళేమిటని చాలా కోపించి, యజమాని ఇచ్చిన ఫోటోలను జేబులో పెట్టుకొని వెళ్ళిపోయెను

ఆ రాత్రి అతడు స్కూలు బిల్డింగునకు కాపలా కాయుచుండగా దొంగలు వేటకుక్కలను అతనిపైకి ఉసిగొల్పిరి. అతడు చేయునదిలేక తన జేబులోని 'సత్యసాయి' ఫోటోలను తీసి ఆ కుక్కలకు చూపించి "సాయిరాం, సాయిరాం" అని అరచెను. వెంటనే ఆ కుక్కలు, అతనిని తరుముట మాని, ముందు కాళ్ళు అతని గుండెలపై వేసి మూతితో ఆ ఫోటోలను వాసన చూసి, నాకి, తోకాడించుచూ వెనుదిరిగి తమ యజమానులనే దూరముగా తరిమివేసినది. ఇది గమనించిన సెక్యూరిటీగార్డుకి ఆశ్చర్యము వేసెను వెంటనే అతడు తన యజమాని 'విక్టర్ కానూ' గారిని సమీపించి "పెద్ద బులెట్స్" (Big Size Bullets) ఇమ్మని ప్రార్థించెను. ఆయనకు అర్థము కాలేదు అతడు జరిగినదంతా వివరించి పెద్దసైజు సాయి ఫోటోలు కావలయునని కోరెను.

స్వామి సర్వవ్యాపకతకూ, సర్వశక్తివంతమునకూ, దైవశక్తికి ఇంతకు మించిన తార్కాణమేమి కావలయును విక్టర్ కానూగారు వ్రాసిన "Satya Sai— The God in Carnate" అన్న గ్రంధమును చదివిన ఇంతకు మించిన అద్భుతమైన స్వామి అనుగ్రహములెన్నో మీకు బోధపడగలవు భార్య ఆరోగ్యము సహితము విస్మరించి, నిస్వార్ధతతో ఆయన అహోరాత్ర

ములు EHV ప్రణాళికలలోనే కృషి చేయుచూ స్వామిచే త్వరలో 2000 సం॥ నుండి తీసికొనరాబడు శ్రీ సత్యసాయి శకమునకు ముఖ్య వైతాళికుడుగా— పనిచేయుచూ ఆనందించుచున్న అదృష్టవంతుడు. ఇట్టి అవతార పురుషునికి సమకాలికులుగా పుట్టిన అదృష్ట వంతులమైన మనమందరమూకూడా నేటినుండీ వారి చేతిలో పనిముట్లుగా ఉపయోగపడుచూ సంఘసేవకు నడుము కడదామా మరి! జై సాయిరాం! ○

# శ్రీ సాయి దర్బారు

-బి. వి. ఎల్. నరసింహారావు

దర్బారులెన్నో పుట్టి, పెరిగి కరిగిపోయె భువివి
దర్బారు వైభవము చాటనున్న సాయిదే ఘనమ్ము
రారాజులకు, ఫకీరులకు తరాజులకు సమస్త
జీవరాశికే దర్బారు రాజాధిరాజు సాయి దర్బారు ॥

మహజరులర్పింప పనిలేదు మనస్సులే
మహజర్లు కాగ భక్తితో నిండి వంగి వంగి
జీహుజూరన పనిలేదు "సాయీ" అనగ
పహారానిల్చు మనోవాక్కాయ కర్మలందు ॥

ఐశ్వర్యము తోడ పనిలేదు ఐహిక విషయ
వాసనలు నశింపజేయు నీ పవిత్ర దర్బారు
అశ్వమ్ములు రథమ్ములు అక్కరలేదు భవ
పాశమ్ములు త్రెంచు శ్రీ సత్యసాయి నిత్య దర్బారు ॥

నన్ను నావైపు చూడు నిను చూతునన్న భరోసా
నేనుండ నీకు భయమేలనన్న అభయమ్ము ముం
దు నీ ఒక అడుగుకు నే పది అడుగులువేసి వత్తు
నన్న దివ్యవరమ్ము ప్రసాదించు సాయిపండు దర్బారు॥

దుర్గుణ నాశనమ్ము సద్గుణ ఖనిని సమ
కూర్చు దివ్యఖజానా గురికాదు దోపిడీకి
ఓర్పు భక్తి పెంచు సాయిదైవ ఖజానా ఓ
దార్చు ఆశ్రితుల దీనుల ఆర్తుల సాయిసత్య దర్బారు ॥

మహల్సాపతి పిలిచె సాయినామమ్ముతో విన్ను
బైజబాయి గొలిచె—యశోద—కన్నతండ్రి విన్ను
కైలాసపతివి దివ్యజ్ఞాన భిక్షపతివి షిర్డీ సాయీ!
విలాసముగ సత్యసాయి వైతివి జనావళిని బ్రోవ ॥

తాత్యా మహల్సాపతి నానావళీ హేమలు
దాదా ఖపర్డే బూటీలు దీక్షిత్ రత్తంజీలు
రాధాబాయి శ్యామలు దాసుగణులున్నట్టి
మల్బరీ దర్బారు శ్రీ సాయి మహరాజు దర్బారు ॥

విశ్వవిస్తృతమై వెలుగు శ్రీసాయి దివ్యాత్మ దర్బారు
సమస్త జీవుల ననుశాసించి పాలించు దర్బారు
ప్రశస్తముగ భక్తి విశ్వాసములు పెంచు దర్బారు
సమస్త కళ్యాణగుణ వైభవ సాయి విందు దర్బారు ॥

రాజాధిరాజ యోగిరాజ పరమహంస దర్బారు
సచ్చిదానంద సద్గురు సాయినాథుని దర్బారు
సత్య ధర్మ శాంతి ప్రేమ శ్రద్ధ సబూరీ దర్బారు
సకల జీవరూప బ్రహ్మాండ తేజ సత్యసాయి దర్బారు॥

శివశక్తి రూపా! సాయీ! నేడు సత్యసాయి నీవు
భవహరుడవు బ్రహ్మసనాతనుడవీవు సాయీ!
అవధరింపుమయ్య ఈ చిన్ని పొన్ని దర్బారు స్తోత్రమ్ము
కావుమయ్య షిర్డీశ్వరా పర్తీశ్వరా! సత్యసాయీశ్వరా!

## నేటి విద్యారంగ సమస్యలపై

# సత్యసాయి బాబావారి ఉపదేశాలు

-డా॥ ఆర్. గంగాధరశాస్త్రి

భగవాన్ బాబావారి దివ్యావతరణము గురించీ, వారు ప్రేమతో విశ్వ మానవ కళ్యాణానికి గాను అందించుచున్న సేవల గురించి గానీ, ప్రపంచములో ఈరోజున తెలియనివారెవ్వరూ ఉండరంటే - అది ఏమీ ఆశ్చర్యపడవలసిన విషయము కాదు. ఒక ప్రక్క ప్రత్యక్షముగా భిన్నమతస్థులు, మత ప్రాతిపదికపై రాజకీయ లబ్ధికై సర్వ విధములుగానూ ప్రాకులాడుతూ, ప్రపంచాన్నీ, మానవత్వాన్నీ, ఛిన్నాభిన్నము చేయటానికై పూనుకుంటున్న ఈ రోజులలో, అన్ని మతస్థులనూ తన వద్దకు, అద్వితీయమైన తన దివ్యశక్తితో ఆకర్షించి, వారందరికీ సర్వమత సామరస్యాన్నీ, విశ్వమానవ సౌభ్రాతృత్వాన్నీ, సంవత్సరములుగా అలసిపోకుండా బోధించుచూ మానవజాతి అభ్యుదయానికై అహర్నిశలూ శ్రమించుచున్న కలియుగ అవతారము శ్రీ సాయిబాబావారిది. వారు మానవ వికాశానికీ, అభివృద్ధికీ - అన్ని రంగముల యందూ వివిధ రకములుగా సేవలను అందించుచూనే యున్నారు. కాకపోతే స్వామివారు విద్యా, వైద్యరంగాలయందు ఈ రోజుకీ అందించుచున్న సేవలు " న భూతో న భవిష్యతి " అని లక్షలాదిమంది భిన్న దేశాధినేతల చేతనే కొనియాడబడినవి. ఈ వ్యాసమునందు విద్యారంగానికి భగవాన్ బాబావారు అందించుచున్న సేవల గురించి మాత్రము చర్చించుటకై ప్రయత్నము చేయబడినది.

### 1) ఏది అసలైన విద్య ?

బాబావారు తమ దివ్య సందేశముల ద్వారా, మానవాళికి " అసలైన విద్య ఏది ? " అన్న విషయమై, అనేక పర్యాయములు గుర్తుచేసినారు. " ఆధ్యాత్మిక విద్యా విద్యానాం " అని గుర్తుచేసినరు విద్యలన్నిటియందూ ప్రధానమైనదీ, నేర్వదగినదీ ఆధ్యాత్మికవిద్య. ప్రస్తుత ప్రపంచ పరిస్థితులననుసరించి మనము ఆధ్యాత్మిక విద్యను విడనాడి, లౌకికమైన విద్యలను మాత్రమే పోషించుచున్నాము. విద్య అనేది ఎందుకు ఉపయోగపడాలో తెలియకుండానే విద్యాభ్యాసము గడుపుచున్న ఈ రోజుల్లో, బాబావారు తిరిగి విద్య యొక్క విలువనూ, పవిత్రతనూ మానవాళికి అకుంఠితమైన, దీక్షతో తెలియచేయుచున్నారు పదవులూ, అధికారమూ ధనసముపార్జనకే విద్య, అనే గుడ్డి నమ్మకమునూ, ఏ చదువు చదివితే ఏ అధికార పదవిని పొందవచ్చు? ఎంత ధనము సంపాదించవచ్చు ? ఎంత అధికారమును చెలాయించవచ్చు?, అనే దుర్భావములనూ, దురుద్దేశములనూ విడిచిపెట్టి - విద్యయొక్క పవిత్రతనూ, విలువనూ గుర్తించి వర్తించవలసినదిగా మానవులందరినీ హెచ్చరించుచున్న అవతారమూర్తి సాయిబాబా. ఈ సందర్భముగానే స్వామివారు " Education is for life, not for a living- అన్నారు. జీవితమునందు ఉత్తమ నడవడికను పోషించుకోవటానికి విద్య కాని, జీవనోపాధి నిమిత్తమై విద్య కాదు అట్లా అని విద్య ప్రత్యేకముగా ఆధ్యాత్మిక జ్ఞానాన్ని మాత్రమే పోషించాలని స్వామివారు పలుకలేదు. స్వామివారి ప్రకారము

" ఇహమున సుఖియింప హేమతారక విద్య,
పరమున సుఖియింప బ్రహ్మవిద్య "

అనగా ఆధ్యాత్మిక విద్యనూ, లౌకిక విద్యనూ కూడా ప్రతీ వ్యక్తీ నేర్వవలయును కాకపోతే ఈ రోజులలో విద్య యొక్క విలువనూ, ఆదర్శమునూ మనం ఏ మాత్రమూ గుర్తించటము లేదు. విద్య పోషించవలసిన లక్ష్యముల గురించి బాబా వారు ఈ విధముగా తెలిపినారు

సత్ప్రవర్తన సద్బుద్ధి సత్యనిరతి
భక్తి క్రమశిక్ష కర్తవ్య పాలనములు
నేర్పునదె విద్య అద్దాని నేర్వవలయు
సత్యమైన బాట శ్రీ సాయి మాట

విద్య పోషించవలసిన సద్గుణముల ఈ విధముగా ఉండగా, దురదృష్టవశాత్తూ ఈరోజు విద్యావిధానము

# సాయి నీరాజనం

-బి. రామరాజు

ఏడేడు లోకాల కేడుగడయై కాచు
సాయీశు పాదనఖచారు తారావళికి
నీరాజనం సాంద్ర నీరాజనం
నీరాజనం మంద్ర నీరాజనం

పరమ పావన గంగ ప్రాదుర్భవించిన
శ్రీ సాయిచరణ రాజీవ యుగళంబునకు
నీరాజనం భక్తి నీరాజనం
నీరాజనం రక్తి నీరాజనం

బ్రహ్మాండ భాండాల భారంబు వహియించు
సాయీశు చిరుబొజ్జ కిరుగడల మెరుగులకు
నీరాజనం నిలువు నీరాజనం
నీరాజనం విలువ నీరాజనం

ఇచ్చు చేగాని మరి పుచ్చుకొను చెరుగనివి
సాయిప్రభు వరదాభయహస్తయుగళమునకు
నీరాజనం నవ్య నీరాజనం
నీరాజనం భవ్య నీరాజనం

శ్రీవత్సలాంఛన శ్రీచిహ్నితంబైన
సాయీశుపీన వక్షోభాగ భోగముకు
నీరాజనం భాగ్య నీరాజనం
నీరాజనం భోగ్య నీరాజనం

పగడాల నిగనిగల వగల ఒగడములాడు
సాయి యరుణారుణా ధరదరస్మిత రుచికి
నీరాజనం కెంపు నీరాజనం
నీరాజనం పెంపు నీరాజనం

ఉపనిషద్వాయువులనుచ్ఛ్వాసములనూర్చు
సాయీశు నాసికా చంపకా మోదముకు
నీరాజనం శుభ్ర నీరాజనం
నీరాజనం దభ్ర నీరాజనం

కరుణారసపుజల్లు కడ కన్నులను జల్లు
సాయి పరమాత్ముని విశాల నేత్రద్వయికి
నీరాజనం ఆర్తి నీరాజనం
నీరాజనం కీర్తి నీరాజనం

పదహారు కళలతో బాలచంద్రుని మించు
సాయి సుందర దివ్య ఫాలభాగమునకు
నీరాజనం వెలుగు నీరాజనం
నీరాజనం జిలుగు నీరాజనం

కోటిసూర్య ప్రభా భాసమానంబైన
సాయీశు ముఖ పుండరీక రుచిమండలికి
నీరాజనం స్వచ్ఛ నీరాజనం
నీరాజనం అచ్ఛ నీరాజనం

మానవుని యీ గుణములనుంచి చాలా దూరముగా ఉంచుతోంది చదువుకోనివారికంటే, చదువుకున్నవారే సంఘానికి చీడ పురుగులవలె తయారయినారని బాబావారు అనేక పర్యాయములు వివరించినారు 'విద్యా దదాతి వినయం', అని గ్రహించవలసియుంటే, నిజానికి విద్యను అభ్యసించినవారు వినయ సంపత్తిని పూర్తిగా కోల్పోయి పశువులవలె ప్రవర్తించటము, సర్వ సాధారణమై పోయింది ఎంత ఎక్కువ విద్యావంతుడైతే అంత ఎక్కువ వినయాన్నీ, సంస్కారాన్నీ పోషించుకోవాలి. కాని, దానికి భిన్నంగా ఎక్కువగా విద్య నభ్యసించి, పెద్దపెద్ద పదవు నలంకరించియున్నారందరూ, వినయాన్నికానీ, సంస్కారాన్నికానీ ఏమాత్రం ప్రదర్శించటములేదు. అందుచే ఆధునిక కాలంలో విద్య పెడమార్గాన్ని అనుసరిస్తోందని బాబావారు హెచ్చరించుచున్నారు. అంతేకాక ఈ పరిస్థితికి కారకులైన వారినందరినీ తమతమ విధులను సక్రమముగా నిర్వర్తించి తిరిగి విద్యను పునరుజ్జీవింపచేయమని తెలుపుచున్నారు. ఇందుకుగాను బాబావారు తెలిపిన ప్రకారము, గురువులూ, తల్లితండ్రులూ, విద్యార్థులూ తమతమ కర్తవ్యములను జాగ్రత్తగా నిర్వహించాలి వీరి పాత్రలు ఏవిధంగా ఉండాలి? వీరి విధులు ఏమిటి? అన్న విషయాలపై స్వామి క్రింది విధముగా తెలిపినారు.

## 2] గురువుల యొక్క పాత్ర

విద్యార్థులను ఆదర్శవంతులుగా, ఉత్తమ పౌరులుగా, సద్గుణ సంపన్నులుగా తీర్చిదిద్దేవారు నిజమైన అధ్యాపకులు అధ్యాపకవృత్తి చాలా ఉత్తమమైన, బాధ్యతతో కూడిన వృత్తి విద్యార్థుల మానసిక ప్రవృత్తులను సన్మార్గములో నడిపించుటకు తగిన బలమునూ, శక్తినీ, ధైర్యస్థైర్యములను అందించువారే ఉత్తమ అధ్యాపకులు ఈ రకమైన స్ఫూర్తిని అందించాలంటే మొదట అధ్యాపకుడు ఆ రకమైన జ్ఞానాన్ని కలిగియుండాలి అతనికి ఆ జ్ఞానములేనిచో, దానిని అతను విద్యార్థులకు అందించలేడు అందుకే స్వామి, అధ్యాపకులు Water Tank వంటివారనీ, విద్యార్థులు Taps వంటివారనీ, Water Tank నందు మంచినీరున్నప్పుడే, Taps లో నుంచి మంచినీరు వస్తుందనీ, అలా మంచినీరు Tanks నందు లేనప్పుడు, Taps నుంచి మంచినీరు వచ్చే అవకాశమే లేదని, సర్వదా హెచ్చరించుచున్నారు అంతేకాక అధ్యాపకులను స్వామి Guide Post వంటివారనీ Guide Post ఏ రకముగా అయితే స్థిరముగా ఉండి, అందరినీ తమకు కావలసిన మార్గముపై నడిపించునో, అట్లే అధ్యాపకులు స్థిరముగా ఉండి విద్యార్థులను సన్మార్గములో నడిపించాలనీ తెలుపుచున్నారు. అందుచే, విద్యార్థులయొక్క భవిష్యత్తు, వారి సర్వ జీవితమూ, వారి అభివృద్ధీ—అన్నీ అధ్యాపకులపై ఆధారపడియుండును స్వామి ఈ విషయమై తెలుపుతూ, ఒక్క విద్యార్థి చెడ్డవాడైనచో అతనొక్కడే పాడగును. కాని ఒక ఉపాధ్యాయుడు చెడ్డవాడైనచో వేలాదిమంది విద్యార్థుల జీవితాలను ఆ ఉపాధ్యాయుడు పాడుచేయునని, అనేక పర్యాయములు తెలియచేసినారు. ఈరోజున అసమర్థులైన ఉపాధ్యాయుల సంఖ్య రోజు రోజుకీ మితిమీరి పోవుచున్నది స్వార్థచింతనా, అసమర్థతా, అక్రమ సంపాదనా చింతన, బాధ్యతా రహిత ప్రవర్తనా, వ్యాపారదృష్టి, సంస్కారహీనత, దుష్ప్రవర్తనా మున్నగునవి, అధ్యాపకులలో సర్వ సాధారణముగా కనిపించే లక్షణాలు ఇట్టి అధ్యాపకులు ఏరకమైన నైతిక విలువలను విద్యార్థులయందు పోషించగలుగుతారు? దిగజారిపోతున్న విద్యాధిపుల విద్యా ప్రమాణాలు దేశానికి చాలా హానికరంగా తయారగుచున్నవి ఈ రకమైన పతనమునుంచి అధ్యాపక లోకాన్ని ఉద్ధరించాల్సిన అవసరం ఈరోజున ఎంతైనా

ఉందని స్వామివారి ఉవాచ. అధ్యాపకులు, తమ వృత్తికి తగిన రీతిలో ప్రవర్తించుచూ, తమ ధర్మాన్ని తాము సక్రమముగా నిర్వర్తించుచూ, స్వప్రయోజనములనూ, స్వార్థ చింతననూ విడనాడి, రాజకీయాలకు దూరంగా ఉంటూ, విశ్వమానవ కళ్యాణానికీ, ప్రపంచ శాంతికీ శ్రమించాల్సిన అవసరము ప్రస్తుతము ఎంతైనా ఉన్నది.

### 3) తల్లిదండ్రుల పాత్ర

విద్యార్థుల యొక్క అభివృద్ధికీ, వారి ఉత్తమ జీవనానికీ ఏ రకంగానైతే అధ్యాపకులు చాలావరకూ బాధ్యులో, అదే రకంగా వారి తల్లిదండ్రులు కూడా చాలావరకూ బాధ్యులనే విషయాన్ని, మనం గ్రహించాలని, బాబావారి బోధ. పిల్లలకు జన్మనిచ్చినంత మాత్రాన వారిని తల్లిదండ్రులనటానికి వీలు లేదు. పిల్లలను ఉన్నతమైన రీతిలో చక్కదిద్ది, ఉత్తములైన పౌరులుగా తీర్చిదిద్దాల్సిన బాధ్యత తల్లిదండ్రులదే.

ఈ రోజులలో పిల్లలకు జన్మనిచ్చేంతవరకు మాత్రమే కాని ఆపై తల్లిదండ్రులు వారిని సక్రమంగా తీర్చి దిద్దటము లేదు. వారి బాధ్యతను వారు పూర్తిగా విస్మరించటమే కాక, అసహ్యించుకొనే దుస్థితికి దిగజారి పోయినారు. ఉద్యోగరీత్యా ఇద్దరూ ఇంటికి దూరముగా ఉండటముచేత పిల్లల ఆలనా పాలనా ఇతరులపై విడిచి పెట్టటం జరుగుతోంది. అంతేకాక, చాలామంది పిల్లల జీవితాలలో తల్లిదండ్రుల అనిర్వచనీయమైన ప్రేమ కనుమరుగై పోవడం జరుగుతోంది. ఈ విధంగా వారి ప్రేమను నోచుకోని పిల్లలు సంఘమునకు బరువుగా మిగులుతున్నారు.

తల్లిదండ్రులు, తమ పిల్లలు సక్రమముగా విద్యాలయాలకు చేరుతున్నారా ? లేదా ? శ్రద్ధగా క్లాసులు attend అవుతున్నారా ? లేదా ? సక్రమంగా స్కూలు వందు ప్రవర్తిస్తున్నారా? లేదా ఎటువంటి సాంగత్యంలో ఉంటున్నారు ? అనే విషయాలు కడు శ్రద్ధతో ఆలకించి, వారిని సక్రమమైన మార్గంలో ప్రవేశింపచేయాల్సిన బాధ్యతను స్వీకరించి, నిర్వర్తించాలి. ప్రస్తుత పరిస్థితులలో, విద్యార్థులు సక్రమంగా స్కూలుకు చేరక పోవుట చేరినా చెడ్డవారి సాంగత్యములో చేరి దుష్కార్యములలో ప్రవేశించుటా, అసభ్యకరమైన కృత్యములాచరించుటా, విద్యార్థులుగా కాక - విషయార్థులుగా ప్రవర్తించుటా - ఇవన్నీ కూడా తల్లిదండ్రులు తమ బాధ్యతలను విస్మరించుటవలన కలిగిన దుష్ఫలితాలే మితిమీరి పిల్లలను ప్రేమించటముగాని, వారిని అసలుకే ప్రేమించకుండా ఉండుట గాని పనికిరాదు. వారిపై దేశ భవిష్యత్తే కాక, ప్రపంచ భవిష్యత్తు కూడా ఆధారపడి వుందని గ్రహించి, క్రమశిక్షణతో కూడిన, సమర్థవంతులైన, శక్తివంతులూ, మేధావంతులైన పిల్లలను ప్రపంచానికి అందించటానికి తల్లిదండ్రులు శ్రమించాలి. తమ స్వార్థంకోసం, తమ ఆనందంకోసం, తమ కన్న బిడ్డలనూ వారి బంగారు భవిష్యత్తునూ పట్టించుకొనకుండా ప్రవర్తించేతల్లిదండ్రులసంఖ్య ప్రస్తుతం ప్రపంచంలో అధికమవుతోంది. ఈ పరిస్థితిని అదుపుజేసి, "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ" అనే రీతిలో విద్యార్థులను తీర్చిదిద్దటానికి అధ్యాపకులూ, తల్లిదండ్రులూ కంకణం కట్టాల్సిన సమయమాసన్నమైనదని అందరూ గుర్తించి వర్తించాలి.

### 4) విద్యార్థుల పాత్ర

బాబావారి ప్రకారము విద్యార్థి దశ జీవిత భవనానికి పునాది వంటిది. ఈ విద్యార్థులు తమ విద్యార్థి దశలో సాధించవలసినవి ఏమనగా Self confidence, Self Satisfaction, Self sacrifice మరియు



Self realisation బాబావారు వీటి గురించి ప్రస్తావించి నప్పుడు పలికిన పలుకులేవనగా, విద్యార్థులు పై లక్ష్యములు ఎందువలన అలవరచుకోవాలంటే - Self confidence అనే foundation ను భద్రము చేసుకోవాలి. దానిపై Self Satisfaction అనే గోడలను విద్యార్థులు నిర్మించుకోవాలి. ఆ గోడలపై, స్వామివారి ప్రకారము, Self Sacrifice అనే roof ను ఏర్పాటు చేసుకోవాలి. తద్వారా జీవితమునందు Self realisation కు ప్రయత్నము చేయగలుగుతారని స్వామివారి ఉవాచ.

విద్యార్థులు, తమ జీవితమనే భవనాన్ని స్వామివారు తెలిపిన ప్రకారము, పైన వర్ణింపబడిన నాలుగుగోడల పైన నిర్మించుకోవాలి. దీనికై, విద్యార్థి ముందుగా తన కర్తవ్యాన్ని గుర్తుంచుకోవాలి. విద్యార్థి విద్యార్థిగా ఉండాలిగాని - విషయార్థిగా మారరాదు తల్లితండ్రుల నుంచీ, అధ్యాపకులనుంచీ, సర్వదా విద్యార్థులు తమ కర్తవ్యాన్ని గురించి తెలుసుకోవాలి తల్లిదండ్రులను గౌరవించటమూ, గురువులయందు భక్తిభావము పెంపొందించుకోవటమూ విద్యార్థుల ముఖ్య కర్తవ్యములని గ్రహించాలి. ఈ రోజున విద్యార్థులు, తమ తల్లితండ్రులను అగౌరవపరచటమేకాక, తమరు ఏరకమైన జీవితాన్ని విద్యాలయాల్లో గడుపుతున్నదీ వారి తల్లి తండ్రులకు తెలియనీయటం లేదు. అంతేకాక దుష్టులైన వారి సహవాసాన్ని అనుభవించటము విద్యార్థులందరి లోనూ సర్వ సాధారణ లక్షణమైపోయింది. కాలేజీల యందూ, యూనివర్శిటీలయందూ విద్యార్థులు ఆచరించు చున్న అరాచకమైన పనులు వర్ణింప నలవికానివిగా ఉంటున్నాయి. నిజానికి, చదువుకొని సంస్కారవంతులై సంఘానికి సేవలనందించవలసిన ఈ విద్యార్థులే సంఘానికి అనర్థముగా తయారవటము చాలా శోచనీయమైన విషయము. ప్రస్తుతము విద్యార్థులున్న స్థితి చాలా విచారకరముగానూ, దేశ భవిష్యత్తుకు ప్రమాదకరముగానూ ఉన్నదనుట అక్షర సత్యము. ఈ విధమైన స్థితి నుంచి వారిని కాపాడి, తద్వారా దేశాన్ని కూడా కాపాడుకోవలసిన అవసరం దేశ ప్రజలకెంతైనా ఉంది.

అధ్యాపకులనూ, తల్లిదండ్రులనూ, విద్యార్థులనూ- సక్రమమైన మార్గముపై నడవటానికీ, వారివారి కర్తవ్యములను వారికి గుర్తింపచేయటానికీ, తగిన ప్రయత్నము శీఘ్రముగా చేపట్టవలసియున్నది అంతేకాక, ముఖ్యంగా వీరందరిలోనూ మానవతావిలువలను మేల్కొల్పవలసిన అవసరము ఎంతైనా యున్నది. ఒక్క మానవతా విలువల ద్వారా మాత్రమే ప్రజలను చైతన్యవంతులుగా చేయటం సాధ్యమవుతుంది. ప్రస్తుతము ఈ మానవతా విలువలను ప్రపంచ మానవులందరిలోనూ మేల్కొల్పటానికి కోటానుకోట్ల రూపాయలు వెచ్చించి, తన అమూల్యమైన కాలాన్ని ఇందులకే కేటాయించి, ప్రపంచ మానవాళియందు నూతనమైన ఉత్తేజాన్ని పెంపొందింప చేయటానికి తీవ్రముగా కృషి సలుపుచున్న ఒక్కగానొక్క అవతారము శ్రీ సాయిబాబా వారిది.

ప్రపంచము నందలి భిన్న దేశాధినేతలు, తమతమ విద్యావిధానములందు- మానవతా విలువల పోషణకు ఇవ్వవలసిన ప్రత్యేకమైన స్థానమును ఇప్పటికైనా అందించనిచో- ప్రపంచ మానవాళికి విద్యావంతుల వలన, విద్యావంతుల ద్వారా నాశనము తప్పదు. ౦౦౦

జ్యోతిషశాస్త్ర నిరూపణ :

# "అవతార పురుషుడు" శ్రీ సత్యసాయిబాబా

-రచన: శ్రీ మణి రామచంద్రన్

ప్రసిద్ధ ఆంగ్ల పత్రిక ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా 19-25 జూన్ 93 సంచికలో జ్యోతిష పండితుడు శ్రీ సునిల్ చతుర్వేది "ఆస్ట్రో ఫోకస్" శీర్షిక క్రింద శ్రీ సత్యసాయిబాబా జాతక చక్రము వివరించియున్నారు. దానిని ఆధారముగా గైకొని విశేషించి ఈ వ్యాసము రూపొందింపబడినది నిస్సందేహముగ ఈయన ఈ యుగమందు ఆవిర్భవించిన అవతారపురుషుడు. ఈ వ్యాసము స్వామివారి అవతారము దాల్చుటను గూర్చిన విషయ విశ్లేషణము, ఇతరులకు స్వామివారిని గూర్చిన అపోహలు, వారి మహిమలు, అద్భుత క్రియలను గూర్చిన సంశయములు నివారించుట మొదలైన వానిని తెలుపుటకు నియమితమైనది.

పైన తెలుపబడిన వ్యాసకర్త లగ్నము Rising Sign (Ascendant) జన్మకాలమును బట్టి వృశ్చికరాశి యని నిర్ణయించగా ప్రొఫెసర్, యన్ కస్తూరి తన గ్రంథము "సత్యం, శివం, సుందరం" మొదటి భాగమునందు 58-45 ఘటికల జన్మ నిర్ణయమునుబట్టి, జన్మరాశి, నవమ పట్టికలను బట్టి ( Rising sign ) లగ్నము తులరాశి యని నిర్ణయింపబడినది. ఇందు పొందు పరచబడిన రాశి, నవాంశ పంచాశ పత్రములను బట్టి ఇదే విషయము నిర్ధారణ అగుచున్నది దీనిని బట్టి చూచిన గ్రహముల స్థితి నిర్ణయమున (Rising sign) లగ్నమును బట్టి కొన్ని భేదభావములు ముఖ్యమైన జ్యోతిష నిర్ణయములందు పొడసూపుచున్నవి.

భగవాన్ బాబా 23-11-1926 సూర్యోదయమునకు పూర్వము జన్మించియున్నారు. సూర్యోదయము ఉ 6 గం॥ 24 నిముషములు అని 15° ఉతర రేఖాంశము దగ్గర గల అనంతపురమును బట్టి ఉండగా, 75 కిలోమీటర్లు గల పుట్టపర్తి 14-41 డిగ్రీలు ఉత్తరము 77-38 తూర్పు అక్షాంశముల మధ్య గలదని గ్రహించవలయును. జాగ్రత్తగా పరిశీలింపగా జననకాలము ఉదయం గం. 5-32-20 అని నిర్ణయమైనది జననము సూర్యోదయాత్పూర్వము గనుక హిందూ ధర్మ శాస్త్రమును బట్టి 22-11 1926 అని తెలియనగును. గనుక Rising sign (Ascendant)

తులా రాశి 28°-50° డిగ్రీలు అని నిర్ణయము.

---

అనువాదం : డా॥ రాపర్ల జనార్ధనరావు

ముందుగ స్వామివారు జన్మించిన, సంవత్సరము' మాసము, వారము, తిథి, నక్షత్రము, యోగము విచారింతుము. అవతారమనగా పరబ్రహ్మ, మానవ రూపము దాల్చి, మానవ చేష్టలు కలిగియుండియు, మానవుల విధి నియమములకు కాల ప్రభావములకు, అతీతుడయి ఉండుటయే కదా ! అట్టి అవతార పురుషుడు తన జన్మ కాలము, స్థలము మొదలగు విషయముల నన్నింటినీ తనకు తానే నిర్ణయించుకొని అవతార మెత్తుట తన అవతార లక్ష్య సిద్ధికై కావలసిన విషయ సంగ్రహణ చేయుట సహజమే కదా !

భారతావని యందు జన్మించిన ప్రసిద్ధ జ్యోతిషవేత్త మహర్షి వరాహమిహిరుడు, 60 ఏళ్ళ కాలమును 5 సంవత్సరముల గల 12 సమకాలములుగ విభజించి యున్నాడు ఈ పన్నెండు విభాగములకు పన్నెండు అధిపతులు

1. విష్ణు 2. బృహస్పతి, 3 ఇంద్ర 4 - అగ్ని 5. ప్రజాపతి 6. ఆహిర్బుధన్య 7. పితృ 8. విశ్వదేవ 9. సోమ 10 ఇంద్రాగ్ని 11. అశ్వనీకుమార 12. సూర్యుడు ఉన్నారు. మరల ఈ 5 సంవత్సరముల విభాగమునందు ప్రతి ఏట ఒక్కొక్క అధిపతి 1. అగ్ని 2. సూర్య 3 చంద్ర 4. ప్రజాపతి 5. శివుడు ఉన్నారు.

అక్షయనామ సంవత్సరం అన్ని సంవత్సర నామములలోను చివరిది. అనగా క్రొత్త సంవత్సర చక్రము నూతనత్వము ప్రారంభమగుటకు ఒక సూచన. అధిపతి సూర్యుడు, అక్షయ సంవత్సరాధిపతి శివుడుజన్మించిన మాసము కార్తీకమాసము ఇది శివ పూజలు దేవాలయములు గృహములలో దీపారాధనతో చేయు పవిత్రమైన కార్తీకమాసము. శివ ప్రీతికరమైన మాసము. జన్మించిన వారము సోమవారము. ఇదియు శివ ప్రీతికరమైన దినము. జన్మ నక్షత్రము ఆరుద్ర. ఇదియు రుద్రప్రియమైనది. ఈ ఆరుద్ర నక్షత్రమునందు ఏటా శివుడు డిశెంబరు నెల నటరాజ నృత్యముసల్పును. శివుని నటరాజ రూపమును ఎల్లరూ అర్చన చేస్తూ ఉంటారు. విశ్వతాండవము విరాటరూపమునచేయు శివుని నటరాజు అందుము. మరియొక సువితమైన విశేషము గ్రహింతము. దక్షిణ భారతముననే "ఆరుద్ర దర్శనము" రోజున నటరాజ పూజ జరుపుటయు, స్వామి అవతారమెత్తుటయు దక్షిణ భారతమున జరుగుట గమనీయాశ్వము. ఇక జన్మ తిథి పరికించినచో ఆ దినము " చతుర్థి ". ఈ జన్మ యోగము 'శుభ' ములను కలుగజేసెడిది. ఈ జ్యోతిష లక్షణములన్నియు పరిశీలించినచో బాబాను శివుని అవతారముగ భక్తులు ఎల్లరు పూజించుట విశదమగుచున్నది. మరియొక ముఖ్య విషయము. మనము గమనింపవలయును. తాను నటరాజ రూపమున నాట్యము చేసెడివేళ భరద్వాజ మహర్షికి శివుడు తాను కలియుగమున మూడుసార్లు అవతారములు దాల్చెనని తెల్పియున్నాడు.

అయితే, కొన్ని కోట్లమంది అదే సంవత్సరము, నక్షత్రము, తిధి వారమున జన్మించుచున్నారు కదా ! వారందరు బాబావలె శివ అవతారులు ఎందువలన అగుట లేదు అనెడి ప్రశ్న జనించవచ్చును ఈ ప్రశ్న గూర్చి ఒక విషయము గమనించవలయును. ఎంతో మంది ఇదే లగ్నమున, ఇదే గ్రహ సంచారము కలిగియున్నవేళ జన్మించిననూ, వివిధ రీతులైనవారు ఉండెదరని తెలియవలయును కారణమేమన డిగ్రీ తేడా వచ్చినప్పుడు ప్రతిదానికి ఎంతో మార్పువచ్చును. లక్షణములు కూడ ఎంతో భిన్నముగ నుండును. ఈ సందర్భమున ఆశ్చర్యజనకములగు నాడీ జ్యోతిష ఫలితములు గుర్తెరుగవలయును మరియొక ముఖ్య విశేషము. మానవుని జీవితమంతయు, స్థూల, సూక్ష్మ, అధిసూక్ష్మమని మూడు భాగములుగ విభజింపనగును. కనుక జన్మ సంవత్సరము, నక్షత్రము, తిథి వారము, " స్థూల " రూపమును తెల్పును గ్రహ సంచారము, వాని బలము, లక్షణములు, వాని విధానములు. "సూక్ష్మ" రూపమును తెలియపరచును ఇక మూడవది యగు "అధిసూక్ష్మము" గ్రహముల కారకత్వము, 'వర్గములు రాశులయందు గ్రహములున్న విశేషములను బట్టి నిర్ణయింపబడును ప్రాచీన జ్యోతిషాచార్యులు వరాహమిహిరుడు, జైమిని, పరాశరుడు, మంత్రేశ్వరుడు మొదలగు మహాత్ములు ఈ విషయములన్నిటిని గూర్చి ఎంతో విపులముగ, సమగ్రముగ వివరించియున్నారు.

ఈ క్రింద వివరింపబోవు జ్యోతిష విశ్లేషణము వలన మహాత్ముల వివరణములను ఆధారము చేసికొని, జ్యోతిషాచార్యుల తెల్పిన వానిని ఆధారముగ గైకొని సాక్ష్యాధారములతో భగవాన్ బాబా శివశక్తి రూపమైన అవతారమని నిరూపింపబడినది.

అది ఎట్టిదో విచారింతము. జాతక చక్రమును పరిశీలింతము Rising sign లగ్నము తులా రాశి (28°-50°) ఇది ఒక విచిత్రమైన, పురుషరూపమైన, సంచారయుక్తమైన, అదృష్టకరమైన లక్షణములు కలది. జనన కోణము (Birth degree) గురుడు లేక బృహస్పతి (Constellation) అంశమున యున్నది. తుల రాశియందు జన్మించినవారు, సమ్యక్ భావుకులగను, విషయ పరిగ్రహణమందు తులాత్మకముగ పరిశీలించి సూక్ష్మముగ రాబోవు విషయములను తెలిసికొని సమగ్ర భావము కలిగియుందురు. వారి నిర్ణయములు పటిష్ఠముగ నుండి, హీనమైన భావములకు సుదూరులై, ఆధ్యాత్మిక మగు మార్పులను నెలకొల్పి, ప్రజానీకమును తమ కార్యములు బోధనల ద్వారా ప్రభావితము చేయగల వారగుదురు. నీతి నిజాయితీపరులై, ధర్మజీవనము గావించుచు, వీరు, ఎట్టి త్యాగమునకైన సంసిద్ధమొంది, స్వతంత్రత, సత్య జీవనములకు ప్రాధాన్యత నొసంగెదరు.

ఈ జననమొందిన వ్యక్తి యొక్క వివిధ గ్రహముల స్థితి, తొలిసారి చూచినంతటనే జాతకమందుగల మహత్తర విశేషము గోచరింపనగును, జన్మకోణము ( Birth degree ) బృహస్పతి లేక గురుని అంశము నందుండుట, జన్మించిన వ్యక్తి యొక్క జీవన విధానము ఆతని ఉద్యమ విశేషములను సూచించును. ఈయన జాతక చక్రము మరింత పరిశీలించినచో గురుడు ఈయనకొసగిన మహత్తర శక్తి తెలియును.

మరింత ముందుకు మనము సాగకమునుపే, ఈవ్యక్తి జాతక చక్రము, ఋషి జీవితమును గూర్చి సూచించు చున్నదా ! అయినచో ఎట్టి ఋషి జీవన విధానము కలవాడగును అనిన ప్రశ్నలకు సమాధానము అరయుదము. మహర్షి మంత్రేశ్వరుడు తన ప్రసిద్ధమైన జ్యోతిష గ్రంథరాజమైన " ఫలదీపిక " యందు 27 వ అధ్యాయము మొత్తము ఈ విషయ విశదీకరణమునకై వినియోగించియున్నాడు ఈ గ్రంథమందు 27 వ అధ్యాయము మొదటి శ్లోకముననే మంత్రేశ్వరుడు రాశి చివరయందు ఉన్నతాంశము ( Rising sign ) కలిగి శుభగ్రహముతోడ నుండి, గురుడు కేంద్రము లేక త్రికోణమును ఆవరించియున్నచో ఆ వ్యక్తి మోక్షమును బడయునని తెల్పినాడు. Ascendant. (లగ్నము) తులారాశి 28°-50° యందున్నది. తులారాశి చివరి భాగమందు శుభకరమైన శుక్రుడు కలిగి, గురుడు లగ్న కేంద్రమునవిండియున్నాడు. (IVth to Lagna in Capricorn) ఈ విధముగ చక్రము భగవాన్ బాబా ముక్తజీవియని నిరూపించుచున్నది ఈ గ్రంథమునందే ఈ అధ్యాయమున 25 శ్లోకములందు వివిధ రకములగు యోగి జీవనుల గూర్చి వివరింపబడినది రెండవ శ్లోకమును బట్టి తెలియునదేమన ఒకే ఇంటియందు నాలుగు గాని లేక మరిన్ని గ్రహములు గాని ఉండినచో, ఆ వ్యక్తి గొప్ప యతీశ్వరుడై అందుగల శక్తివంతమైన గ్రహమును బట్టి, ఆయా లక్షణములు కలవాడగునని తెలియవచ్చుచున్నది.

వృశ్చికరాశియందు, సూర్యుడు, శని, శుక్రుడు, బుధుడు ఉన్నారు. సూర్యుడు తన "నైసర్గిక ఫలము" వలన చాల శక్తివంతుడై యున్నాడు. మేషరాశియందు సూర్యుడు స్వయోగము (Birth yogi) కలిగి తన గ్రహకూటమందే ఘనముగనున్నాడు. నవగ్రహముల కధిపతిగనున్న ఈ సూర్యుడు, తన సూర్యకుటుంబము నందు, ఆత్మ కారకుడగుచున్నాడు. మంత్రేశ్వరుడు 6 వ శ్లోకమునందు సూర్యుడు శక్తివంతుడై అధిపత్యము కలిగినవాడై యుండినచో, ఆ జాతకుడు సమకాలీన యోగిపుంగవులయందు ఘనముగ ప్రకాశించుచూ సన్యాస ఆశ్రమము స్వీకరించియుండగలడని వెల్లడించియున్నాడు. ఇంతకన్న వేరేమి కలదు. బాబా

"లోక గురువు" శివుని అవతారము, యతీశ్వరుల మకుటము అని గ్రహింపనగును. ఈయన జాతక చక్రమందు సూర్యుని ప్రాబల్యము వలన బాబా, ముక్తుడై సమకాలీన యోగిపుంగవులందు అగ్రగణ్యుడై యుండుటవలననే, ఆయన చేసెడి అద్భుత శక్తులు లభించియున్నవి. ఆయన చేసెడి అద్భుత క్రియలు సాధారణమగు హీనమైనవి గాక, ఆత్మోన్నతిని కలిగించెడి ఉత్కృష్టమైనవిగా నున్నవి.

దైవశక్తి మానవ రూపము పొందినపుడు, ఆ దైవ శక్తి మానవుని మనస్సు వివేకము ఆత్మపైన అధికారము కల్గియుండును ఈయన ఆధ్యాత్మిక జీవితమును గూర్చి అరయుదమన్నచో 'పంచాంశ' చక్రమును పరికింపవలయును. దీనియందు సూర్యుడు, చంద్రుడు, ఉన్నతముగనున్నారు. దీనినిబట్టి ఆత్మకారకుడగు సూర్యుడు విజ్ఞానమును, చంద్రుడు మనస్సును ఉద్దీపించుచున్నారు. గనుక భగవాన్ బాబా జాతక చక్రమును పరిశీలించినచో ఆయన కేవలము మానవ రూపమున నున్న పరమాత్మ యని తెలియవచ్చుచున్నది. ఇక ఆయన జీవిత విధానము, కార్యాచరణ మున్నగు విషయము లెట్లున్నవో వారి జాతక చక్రము చూచి పరిశీలింతము.

గురుడు వీరికి వేదజ్ఞాన పారీణత, ఆచార్య స్థానము నిచ్చుచూ ( iv to Lagna in Capricorn) మకర రాశి 4 వ స్థానమునకు లగ్నమందున్నది. కొద్దిపాటి నీచముగనున్నను 3 వ స్థానమైన శని వలన లాభము పొందుచున్నాడు.

తులారాశి జాతకులకు శని మహత్తరశక్తివంతుడై లాభించును. అందువలన గురుడు "నీచ భంగరాజ యోగి" యగుచున్నాడు. మంత్రేశ్వరుడు ఏడవ అధ్యాయము 28 వ శ్లోకమందు "నీచభంగరాజయోగి" జాతకుడు ప్రపంచమును పరిపాలించి ప్రసిద్ధుడగునని తెల్పుచున్నాడు. మరియు చంద్రునికి 8 వ స్థానమున యుండుటచే, గురుడు అధియోగుడై సంపన్నతను చేకూర్చువాడగుచున్నాడు. ఇదే గ్రంథమున 4 వ అధ్యాయము, 42 వ శ్లోకమునందు అధియోగమున జన్మించినవాడు దీర్ఘాయుల్కై, ప్రపంచ కీర్తిని బడసి, సమస్త ధనసంపదను పొంది, శుభలక్షణములను కలిగి, ఆత్మోన్నతుడగునని తెలియబడినది. లగ్నమునకు నాల్గవ ఇంటియందున్న గురుడు, జాతకుని అనేకానేక సేవాసంస్థల స్థాపకునిగను, సంతృప్తిగల జీవనునిగను చేయునని వివరింపబడియున్నది.

మంత్రేశ్వరుడు మరల నాల్గవ అధ్యాయమున 35వ శ్లోకమునందు లగ్నాధిపతి ఉన్నతమైన అంశ, కోణ, కేంద్రములయందుండినచో ఆ జాతకునకు "పర్వత యోగము" కల్గును. అంశాధిపతి (Lord of sign) లగ్నాధిపతియైన అంగారకునిచే ఆక్రమించబడినాడు, అంగారకుడు మేషరాశియందు లగ్నమునకు 7 వ స్థానమునందు కేంద్రీకరింపబడినాడు. 36 వ శ్లోకమును బట్టి "పర్వత యోగ" మందు జన్మించిన వ్యక్తి నిత్య సౌఖ్య సంపదలను పొందగలడని నిర్ణయింపబడినది. నిత్య కల్యాణయుక్తమగు కార్యక్రమములను చేబట్టును. భూలోకాధిపత్యము పొందగలడు. దీనిని పరికించిచో బాబా చేయు మహిమాన్విత సమాజసేవ, విద్య, వైద్య సాంఘికపరమైన రంగములలో కళాశాలల స్థాపన, వైద్యశాలల స్థాపనలయందు గల విశేష జీవితము తెలియవచ్చుచున్నది. ఇయ్యది విశ్వవ్యాప్తముగ, అచలమగు భక్తి విశ్వాసములుగల శిష్యకోటి ద్వారా నిష్కామ కర్మముగ ఆచరింపబడుటయు జన్మ విశేషతను ప్రకటించుచున్నది.

పదవ స్థానమునగల చంద్రుడు భాగ్యస్థానమైన తొమ్మిదవ ఇంటనున్నాడు. కాళిదాసుని 'జాతకచంద్రిక' అనుసారముగ క్షీణచంద్రుడు దశమాధిపతియై దుష్ట గ్రహమును రాహువుతో కలిసినను చెడును చేయజాలడు చంద్రుడు సంపూర్ణుడై 'చేష్టబాల'తో బలముబలిగి యున్నాడు. తొమ్మిదవ ఇంట చంద్రుడు జాతకుని మానవసేవా కార్యక్రమ సంస్థలకు అధిపతిగను, ప్రజా రంజకుడుగను, భగవద్భక్తునిగను, నీతిపరునిగను, అనూహ్యమైన వ్యక్తిగను, కీర్తివంతుడుగను చేయును.

ఇంకను చంద్రుడు అధియోగవంతుడుగ నుండి గురునితో కలసియుండిన జాతకము శక్తివంతమగును. ఈ విధముగ కర్మాధిపతియగు చంద్రుడు పదవస్థానమందుండి 9 వ ఇంట నుండి భాగ్యస్థానమగు, 12 నుండి 10 వరకు సత్ఫలితములు చేకూర్చుచు కర్మాధిపతియై జ్ఞానస్థానము కలిగియుండును.

రెండవ ఇంటను సూర్యుడు, శుక్రుడు, శని, బుధులు గలసియుండుటను బట్టి "వాక్ స్థానము" వృద్ధి కలిగి విద్య, కుటుంబమునకు వన్నె కలుగును. శని గ్రహ కూటము కేంద్ర కోణాధిపత్యము కలిగి ( 4,5 ఇళ్ళు ) సూర్యుడు, శుక్రుడు, శని, బుధ గ్రహములతోడ కలసి యున్నాడు. శని ఆధ్యాత్మికతను కలుగజేసి యోగ కారకుడగుట ముఖ్యాంశము. 5 వ ఇంట నుండి ఆధిపత్యము వహించుటచే విజ్ఞత, ఆత్మభావన, భవిష్య జ్ఞానము కలిగి శృతి, స్మృతుల విజ్ఞాన సంపద కలిగి యుండును.

సూర్యుడు ఆత్మకారకుడై 'శివ' కార్యములు, హోమములు, యజ్ఞములు, దేవాలయముల గూర్చిన విశేషములు కలిగియుండును శుక్రుడు స్త్రీ శక్తియైన ప్రేమ "శక్తి" పరిపాలించును గనుక సూర్యుడు, శుక్రుడు గల సమీప సాన్నిహిత్యము "శివ, శక్తి" సంయోగమునకు ప్రతీకయును మరల చంద్రుడు శుక్రునితో అధియోగము కలిగి (చంద్రు నుండి 6 వ స్థానము) యున్నాడు మనస్సునకు అధిపతియగు చంద్రుడు శుక్రుడు, శక్తికి పరిపాలకులుగ నుండుటచే జాతకుని మనోభావములు వెనువెంటనే రూపము దాల్చును ఈ మహిమాన్విత కార్యములు, హీన విషయములకు చెందకుండుటకు కారణము ఈ మహిమ శివశక్తి సంజనితమగుటయే.

బుధుడు (R) చేష్టబాలతో, నవాంశమందలి వృశ్చిక మందు వర్గోత్తమము చెందుటవలన జాతకునికి అనర్గళమైన వాగ్ధాటి ఏర్పడుచున్నది. బాబా ప్రపంచములందు అనర్గళ భాష, భావోన్నతి, కలిగి ఆదరణసిద్ధి పొంది ప్రేమ పూర్ణములగుచున్నది. అన్నియు ఆత్మోన్నతిని గూర్చిన (సూర్యపరము) విషయములగుట విశేషము. సూర్యుడు శనిస్థానమందుండి మూడవవిధిచే గురుని చూచుటయు, గురుడు 'నీచభంగరాజయోగము' కలిగించు విశేషమువలన భగవాన్ బాబా అనుదినము శిష్యకోటికి వేదశాస్త్ర ప్రామాణ్యముగా ఉచిత రీతిని సలహాల నొసంగుట గమనీయము. శృతి స్మృతి ప్రామాణ్యములతో శిష్యుల ఆత్మోన్నతికై బోధచేయుచున్నవాడు గనుక "లోకగురువుగ" వన్నెకెక్కుట గాంచు చున్నారము.

అంగారకుడు (R) 7వ ఇంటనుండి (మూల త్రికోణ రాశి) చేష్టబాలతో నుండుటను బట్టి ఆ జాతకుడు ఎవరితో సాంగత్యము కలిగియున్నది తెలియనగును. అంగారకుడు భూమి మీదగల ప్రజలను అధిపతి గనుక బాబా విశ్వమందలి ప్రజలతో సాన్నిహిత్యము పొంది యున్నాడు అంగారకుడు వృశ్చిరాశియందు రియందుండి రెండవ ఇంటను పరిపాలించుటచే ఈయనకు విశ్వ ప్రజానీకమంతయు తన వంశమనెడి భావన పరివర్ధమై

యుండుట అదిసూక్ష్మ విషయమున చూచినచో కేతు కుటుంబమందు కల, అంగారకుడు మోక్షకారకుడు జ్ఞాన కారకుడు అయివుండుటచే, ప్రపంచ ప్రజలందరు భగవాన్ బాబాను మోక్షప్రదాయునిగ, మోక్ష జ్ఞాన ప్రదాతగ గాంచుచున్నారు

9, 12వ ఇంట ( మోక్షస్థానమందలి ) గురుని వీక్షణము చంద్రుడు అధియోగముకలిగి జ్ఞానస్థానమైన 9 వ ఇంట ఉండుటను బట్టి జాతకుని మనస్సు ఎల్లప్పుడును మానవుల ఆత్మాభివృద్ధికై విత్యాన్వేషణలు వేదశాస్త్రానుసారముగ జరుగుట గోచరించును. ఇది ఆయన అనుదిన చర్యగ గురుడు 10 వ ఇంట 7 వ విధానముచే ఉండుటవలన తెలియవచ్చుచున్నది.

ప్రస్తుతము బాబా లగ్నాధిపతియును శుక్రుని, చంద్రుని భుక్తియందు 25_8_1993 నాటికి పూర్తి చేయుచున్నారు. చంద్రుడు షష్టాకమునందు (6/8) లగ్నాధిపతియగు శుక్రునితో కలిసియుండుట నేడు జరిగిన కొన్ని సంఘటనలను తెలియజెప్పును. అయినను జాతకమునందలి ఘనమైన అంతశక్తి నేటి సంఘటనలు కేవలముతాత్కాలికమైనవి మాత్రమేనని గ్రహింపనగును శుక్రదశ గురుగ్రహణముయొక్క భుక్తి 25_10_1997 నుండి ప్రారంభమై 2 సంవత్సరముల 8 నెలల కాలము. అనగా 25_6-2000 నాటి వరకు ఉండును ఈ కాలము చాల ముఖ్యమైనది ఈ కాలమున జరుగు అనేకానేక సంఘటనల వలన ప్రపంచమంతయు బాబాను అవతారమని గ్రహించును

శుక్రుడు శని కుటుంబంలో ఉండి యోగకారకుడుగా ఉచ్ఛస్థితిలో ఉన్నాడు తులారాశి జాతకునికి, బృహస్పతి అంగారకుని కుటుంబంలో ఉన్నాడు అంగారకుడా భూగోళమందలి ప్రజాధిపత్యమును చూపగా, శుక్రుడు లగ్నాధిపతియై యుండి శనికుటుంబంలో నుండి అధిక శక్తివంతుడైయున్నాడు. గనుక ఈ భూలోకవాసులు ఈ భూలోకమునకు ప్రళయము వాటిల్లి అంతరించి పోవునేమోయని భీతిచెందువారికి ఆయన శక్తివలన శాంతి లభింపగలదు 25_8_2007 నుండి స్వామికి సూర్యదశ (సూర్యుడు ఆయనకు జన్మయోగి) గనుక యావత్ప్రపంచము భగవన్ బాబాకు మోకరిల్లి "జగద్రక్షకు" నిగ వ్యవహరించును

## మైలురాళ్ళు

బాహ్యవిషయముల ద్వారా నా సామీప్యమును పొందలేవు. నీవు నా ప్రక్కనే ఉన్నప్పటికీ చాలా దూరముగానే ఉందువేమో! నాకు ఎంతో దూరమున ఉన్నను, అతి సమీపంగా, సన్నిహితంగా ఉండగలవు. సత్య ధర్మ శాంతి ప్రేమల నంటిపెట్టుకొనియున్నచో, నీవెంత దూరములో ఉన్నను నాకు అతి సమీపంగా నుందువు. నేను కూడా నీకు అట్లే యుందును. అదియే మిమ్ములను నా దగ్గరకు చేర్చు మార్గములోని మైలురాళ్ళు. మీరందరూ సాయి శరీరముయొక్క అంగములే. వినయము, విశ్వాసము మొదలగు మధురమైన, వాంఛనీయమైన గుణములను సాయికి మీరిచ్చినచో, మీరెక్కడున్నను, ఏమి చేయుచున్నను సాయి మీకు సహాయ సహకారముల నందించును.

— బాబా

# భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి జాతకచక్రము

అదృష్టము – యోగి అంశ తిథి – బహుళ చతుర్థి యోగం – శుభం దశభుక్తము . 1 సం. 9 నె. 2 దినములు రాహుదశ జన్మనక్షత్రము: ఆరుద్ర 4వ పాదం

| | | | |
|---|---|---|---|
| యురేనస్ 2°-52' | అంగారక 13°-09' +29°.14' | | రాహు 16°-19' చంద్ర 18°-42' |
| | రాశి చక్రం<br>జననం : 23-11-1921<br>సమయం : 5-32-20 AM<br>స్థలం : పుట్టపర్తి<br>14°-41' N<br>77°-39 E<br>అనంతపురం<br>అయనాంశ<br>22°-44'<br>C. K. P. 7 | | |
| బృహస్పతి 27°-07' | | | నెప్ట్యూన్ 4° - 15' |
| కేతు 16°-19' | శని 6°-5' సూర్యుడు శుక్రుడు 7°35' బుధ 14°-8' | L 28°-50' | |

| | | | |
|---|---|---|---|
| చంద్ర | | | L |
| రాహు | నవాంశ<br>D - 9 | | అంగారక యురేనస్ |
| | | | శని కేతు |
| | బుధ | | సూర్య శుక్ర గురుడు |

| | | | |
|---|---|---|---|
| | రాహు సూర్య శని శుక్ర | చంద్ర బుధ గురు | అంగారకుడు |
| L | పంచాంశ<br>D - 5 | | |
| | | | |
| నెప్ట్యూన్ | యురేనస్ | కేతు | |

# కృతజ్ఞతలేనివాడు క్రూరమృగములకంటే హీనం

— భగవాన్ సాయి దివ్యప్రబోధ

" సత్యం జన విరోధాయ
అసత్యం జనరంజనం
సురాధిక్రీయతే సారే
దధ్యాధికం పీత్వా గృహే గృహే "

ఈనాడు మానవునికి ఇష్టములేనిది ఏదంటే సత్యమే. అందులో తన సత్యమును తాను తెలుసుకోవటానికి మరింత వెనుకంజవేస్తాడు. సత్యము చెప్పాలంటే భయపడుతాడు. అసత్యానికి ముందంజవేస్తాడు. ఇంటింటికి పెరుగు పాలు తెచ్చినప్పుడు ఎవ్వరూ కొనరు. ఊరుబయట చాలా దూరంలో మద్యపానం అమ్ముతుంటే అక్కడికి పరిగెత్తుకొనిపోయి కొని త్రాగుతారు. సత్యాన్ని సులభంగా నమ్మరు. అసత్యాన్ని సులభంగా నమ్ముతారు. ఈ కలి ప్రభావంచేత ఈ అసత్యమును నమ్మటంచేతనే అనేక విధములైన అన్యాయ, అక్రమ అనాచార అసత్యములకు కారకులైపోతున్నారు. సత్యము తీపిగా ఉండదు. కాని కొంత కఠినంగా ఉంటుంది. అసత్యం అతి తీపిగా ఉంటుంది. ఇది విషముతో కూడినటువంటిది. ఈ విషముతో కూడినటువంటి అసత్యము, పైపైన మాధుర్యంగాఉంటుంది. దీనినే తేనె పూసిన కత్తి అంటారు. దీనినే Sweet Poision అంటారు. దీనినే మానవుడు చాలా ఇష్టపడుతున్నాడు సత్యం కచ్చితంగా చెప్పడంచేత అది ఎవరికీ రుచించదు. కనుకనే భారతీయ సంస్కృతి "సత్యం వద", " ధర్మం చర " అని చెప్పింది. అయితే ఈ ఆధునిక యుగంలోపల " సత్యం వధ " " ధర్మం చెర " గా మారింది. అనగా సత్యం వధించబడుతున్నది, ధర్మమును చెరసాలలో పెట్టారు. కనుక ఈ ధర్మమును ఏ రీతిగా పాటించగలము? మన ఆచరణలన్నీ అధర్మమునకు కారణమైపోతున్నాయి. మనం పలికే పలుకులన్నీ అసత్యములే ఈ విధమైన పరిస్థితులలో ప్రపంచం ఏ రీతిగా శాంతిని పొందగలదు? చేతిలో బాంబు పెట్టుకొని శాంతి ... శాంతి ... అని చెబితే శాంతి వస్తుందా? కనుక మాటలతో చెప్పేది శాంతి కాదు, మనసుతో అనుభవించేది శాంతి.

ఈనాటి ఆధునిక విద్య ప్రభావమే ఈనాటి అనర్థములకు మూలకారణం. గౌరవమంటే ఏమిటో, మర్యాద అంటే ఏమిటో - ఈనాటి విద్యార్థులకు తెలియదు. గౌరవాన్ని తాను మాత్రం కోరుతున్నాడుగాని, తాను ఇతరులను మాత్రం గౌరవించడంలేదు. ఇది ఎంత స్వార్థ స్వప్రయోజనములతో కూడినటువంటి జీవితం? మా విజయ సాయి చెప్పాడు. లోకమంతా స్వార్థ స్వప్రయోజనములతో కూడిఉంటున్నది. ఒక చిన్న ఉదాహరణ అధికారులు వస్తున్నారు. స్వామిని దర్శిస్తున్నారు. తమ తమ అభీష్టాలను తాము కోరుకుంటున్నారు, నమస్కరిస్తున్నారు, వెళ్ళుతున్నారు. ఇంక వ్యాపారులు వస్తున్నారు. తమ తమ వ్యాపారముల యొక్క అభివృద్ధి నిమిత్తమై ఆశీర్వాదములు కావాలని ఆశిస్తున్నారు, ఆశీర్వాదములందుకుంటున్నారు, వెళ్ళుతున్నారు. ఉద్యోగస్థులు వస్తున్నారు, వారి వారి అభీష్టములు నెరవేర్చుకొనే నిమిత్తమై, ఏ యొక్క ట్రాన్స్‌ఫరో, ఏ యొక్క ప్రమోషన్లో కోరుతున్నారు. ఆశిస్తున్నారు, అందుకొని వెనుకకు వెళ్ళిపోతున్నారు, విద్యార్థులు వస్తున్నారు, విద్యనభ్యసిస్తున్నారు, విద్య పూర్తికాగానే వెళ్ళిపోతున్నారు. ఇంక అధ్యాపకులు వస్తున్నారు, వారు ఏదో పిల్లలకు Teach (బోధించి) చేస్తున్నారు, వారు వారి పని ముగించుకొని Retire అయిన తరువాత వెళ్ళిపోతున్నారు. ఇంక ఆస్తికులు

వస్తుంటారు, స్వామి సన్నిధికి వచ్చి ఏ జపమో, ఏ ధ్యానమో, ఏ యోగమో, ఏ తపస్సో చేసుకుంటూ వారి జీవితమును సార్థకంగావించుకొనే నిమిత్తమై మార్గములను వెతుక్కొని వారిపాటికి వారు వెళ్ళిపోతున్నారు. ఇంతమంది వస్తున్నారు, ఇన్ని కార్యములు చేసుకుంటున్నారు. కాని స్వామి విషయమంటే ఏమి? అని ఎవరైనా విచారిస్తున్నారా? స్వామిని చూచుకొనే వారు ఎవరూ లేరు. అది నాకు తెలుసు. స్వామి నిమిత్తమై పాటుపడేటటువంటివారు ఒక్కడైనా కనిపిస్తున్నాడా? ఎవరి స్వార్థాన్ని, ఎవరి స్వప్రయోజనాన్ని వాళ్లు చూచుకుంటున్నారే గాని - ఇది భక్తికి సంబంధించినటువంటి విషయమేనా? కాదు ... కాదు... నా నిమిత్తమై నేను చెప్పటం కాదు ఇది. మీ నిమిత్తమై మిమ్ములను హెచ్చరిస్తున్నాను. మీరు పొందినటువంటి ఫలితమునకు తగినటువంటి కృతజ్ఞతను మీరు హృదయంలో నింపుకోవాలి. "కృతజ్ఞత లేనటువంటి హృదయం క్రూరమృగములకంటే హీనం" ఎవరిపాటికి వారు వచ్చి వారి వారి కార్యములను వారు సాధించుకొని పోతున్నారేగాని ఇక్కడ ఏమి జరుగుతున్నాది? ఎట్లా ఉన్నది? ఏమి దీనికి ప్రధానమైన మార్గము? ఏ ఏర్పాట్లు కావాలి? అని యోచించేటటువంటి తలలు ఒక్కటైనా కనిపించటంలేదు. అందరమూ మేము భక్తులమే ... మేము భక్తులమే అంటారు. ఇది 'భక్తి' అని చెప్పుకోవటం కూడా సిగ్గుచేటు.

మొట్టమొదట భగవత్తత్వాన్ని మన హృదయంలో నింపుకోవాలి. దాని తరువాతనే మిగిలినవన్నీ. మన మహర్షులు ఈ విధంగా తమ జీవితాలను అంకితంచేసి తమ జీవితాలను సార్థకం చేసుకున్నారు. ఈనాటి వారిలాగే వారు స్వార్థ స్వప్రయోజనాలకు పాటుపడలేదు. కనుకనే ఆనాటి మహర్షులు ఈనాటి ఉపనిషత్తులకు అధికారులుగా నిలిచారు. కనుక అలాంటి దివ్యమైన త్యాగం మనలో రావాలి. ఈనాడు త్యాగమునకు 'కించిత్' అయినా మనం పూనుకోవటంలేదు. త్యాగము చేయని మానవునకు యోగంగాని, మోక్షంగాని ఎలా లభ్యమవుతుంది? త్యాగం కావాలి ఏమిటి ఈ త్యాగం? ఏనాడైన మనకు కూడనూ కష్టములు వస్తాయి. మనం కొంతమందికి సహాయం చేసినప్పుడు, వారి సహాయమును మనం పొందగలుగుతాం. ఇతరుల సహాయాన్ని ఆశించి, మనం సహాయం చేయనవసరంలేదు. కాని నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు దీనులను, దిక్కులేని వారిని ప్రేమతో ఆదరించు. ఈనాడు మానవుడు స్వార్థంతోనే ఇతరులను ప్రేమిస్తున్నాడు అది కాదు. నీ ప్రేమను పదిమందికి పంచు. అదియే 'ఈశావాస్య మిదం సర్వం' అందరియందు ఉండినటువంటి 'ఈశ' తత్త్వమును మనం ప్రేమించాలి. అప్పుడే నిజమైనటువంటి ప్రేమ నీలో ఆవిర్భవిస్తుంది. కేవలం నీలో మాత్రమే ప్రేమను పెట్టుకొని, పైకి ప్రేమించినట్లుగా నటిస్తే, ఇది కేవలం కూరిన ప్రేమే గాని ఊరిన ప్రేమకాదు మొట్టమొదట స్వార్థాన్ని త్యాగం చేయాలి. దైవాన్ని ప్రేమించాలి దివ్యమైనటువంటి తత్త్వాన్ని సర్వులకూ పంచిపెట్టాలి. ఇదియే ఉపనిషత్తుల సారము.

దేహాలు, దేహాలు వేరువేరుగా ఉంటున్నాయి గాని ప్రేమ ఒక్కటే. దేహభ్రాంతిని పురస్కరించుకొని నీవు భిన్నంగా భావిస్తున్నావు ఇది సరియైన సాధనే కాదు ఇది కలి ప్రభావం యొక్క కృత్రిమమైన సాధనలు ఎన్ని దైవ చింతనలు చేసినప్పటికినీ, మనలో విశాలమైన హృదయం గనుక లేకపోతే, ఈ చింతనలన్నీ వ్యర్థమైపోతాయి. తమ తమ వాంఛలు మాత్రమే నెరవేర్చుకోవటానికి మాత్రమే ప్రయత్ని

స్వార్థ గాని, పరుల వాంఛలు కూడా కొన్ని వుంటాయని గుర్తించుకోవటానికి ప్రయత్నించటంలేదు. నీ వాంఛల వంటివేగదా పరుల వాంఛలు కూడాను నావి మాత్రమే నెరవేరాలి వారివి మాత్రం నెరవేరరాదని భావించడం ఎంత స్వార్థం? ఇలాంటి భేదములను పూర్తిగా త్రుంచి పారవేయాలి. అందరియందు వుండినటువంటి ప్రేమ తత్త్వమును మనం పెంచాలి విశ్వప్రేమ కుటుంబీక ముగా వుంటుండాలి. అప్పుడే నిజమైనటువంటి భక్తి ప్రపత్తులను సాధించినవారమవుతాం.

భక్తి... భక్తి...అంటే ఏదో దేహానుసంబంధంగా వచ్చి పోయేటటువంటిది కాదు దేహసంబంధాలు వస్తుంటాయి, పోతుంటాయి. పెండ్లి చేసుకొనక పూర్వం భార్య ఎవరు? భర్త ఎవరు? పుట్టకముందు తల్లి ఎవరు? బిడ్డ ఎవరు? పుట్టిన తరువాతనే తల్లి, బిడ్డ. పెండ్లి అయిన తరువాతనే భార్య, భర్త. ఇవి మధ్యలో కదిలిపోయే మేఘాలే గాని, శాశ్వతమైనవి కావు. ఈ మధ్యలో వచ్చి కూడినటువంటిదానికే ఈ మిధ్యయైనటువంటి ప్రేమను పెంచుకొని, తన జీవితమును నాశనం చేసుకుంటున్నాడు మానవుడు. ఇది సత్యముకాదు. స్వామి ఇంత కఠినంగా చెబుతున్నాడని మీరు ఏమాత్రం బాధపెట్టుకోకూడదు. ఇది సత్యం కాబట్టే చెప్పవలసివచ్చింది ఎవ్వరినీ ద్వేషించకండి భార్యాపిల్లలనూ ప్రేమించండి. అయితే వీరే మా ప్రాణమని చెప్పి అధికంగా మమకారాన్ని పెంచుకో కూడదు. ఇదే సరియైన మార్గము. దేనికైనా మితి మీరిపోవటం మతిహాని కలుగుతుంది

ఉపనిషత్తులు చెప్పాయి. మానవ జీవితం చాలా కొద్దిపాటిది. కష్టములా అనంతం. ఆనందం అల్పం. ఆ అల్పమైన ఆనందంతో ఆత్మానందమును పొందు. ఆనందమును ఎంతైనా పొందుతున్నావు కాని ఆత్మానందమును పొందాలి. ఆత్మానందములోనే అన్ని ఆనందములు యిమిడి ఉంటున్నాయి. ఎప్పుడు చూచినా "నేను ... నేను ..." "నా పని ... నా పని ..." ఏమిటి నీ పని? బ్రతికి వున్నావు కాబట్టి నీ పని నీవను కుంటున్నావు ఏ రాత్రికి నీ ప్రాణం పోతుందో? అప్పుడు నీ పని ఏమైపోతుంది? దైవ చింతనకు మాత్రం సమయం లేదు మిగతావాటికి మాత్రం వుంటుంది. ఇది ఒక విధమైన దైవ ద్రోహమే అవుతుంది ఇది మంచిది కాదు. ఆత్మద్రోహమునకు మనం పాల్పడరాదు. దైవకార్యమే ముఖ్య కార్యము. అప్పుడే దేశమంతా బాగుపడుతుంది. నీ పనులు కూడా నీవు చేసుకో. దీనిని వదలమని నేను చెప్పను. ఏ పని చేసినా దైవకార్యముగానే భావించి చేయి. ఆ విశాల భావంతో జీవించినప్పుడే, విశాలత్వమనేది నీలో ప్రాప్తిస్తుంది.

మనుషులు మారితే ప్రయోజనంలేదు. ఈనాడు మనసులు మారాలి మనసులు మారకుండా కేవలం మనుషులు మారినంతమాత్రమున మనం ఏమాత్రం విజయాలు సాధించలేము మంచి కార్యములలో మనం సంసిద్ధంకావాలి ఎన్ని అడ్డంకులు వచ్చినా దానిలో మనం ప్రవేశించాలి అదే నిజమైన సంకల్పం. సాధించేంతవరకు మన దేహాన్ని అందులో ప్రవేశ పెట్టాలి నీటిబుడగవంటి దేహంపైన ఎందుకు ఇంత అభిమానం? ఏనాటికైనా పోక తప్పదు. ఉన్నప్పుడే సాధించాలి సత్యము. అదే నిజమైన మానవత్వం. "జంతూనాం నరజన్మ దుర్లభం" జంతువులకు మనకు తేడా ఏమిటి? అవీ తింటున్నాయి, మనం తింటున్నాం. అవీ నిద్రిస్తున్నాయి, మనం నిద్రిస్తున్నాం అవీ భోగభాగ్యములను అనుభవిస్తున్నాయి, మనమూ అనుభవిస్తున్నాం అది 'చతుష్పాద పశువు' 'ఇది ద్విపాద పశువు' దానికి నాలుగు కాళ్ళు, దీనికి రెండు కాళ్ళు. దానికి తోక వుంది, దీనికి తోకలేదు. కనుక

దానికి దీనికి వేషములలో మార్పే గాని గుణములలో ఇద్దరిదీ ఒక్కటే.

ఏనాడు నిత్యానిత్య విషయ పరిశీలనసలిపి, విజ్ఞతతో, విచక్షణతో విజ్ఞానమును కోరుతాడో అప్పుడే వాడు మానవుడు ఉపనిషత్తులు చాలా కఠినంగా చెబుతూ వచ్చాయి. దయ చూపిన కొద్దీ మానవుడు మరింత మోసగాడై పోతాడు. ఎందుకంటే కఠినుడైన మానవునికి కఠినమైన దెబ్బలే చాలా అవసరం బాగా ఎర్రగా కాలిన ఇనుమును ఏ చిన్నపిల్లవాడు కొట్టినా సాగి పోతుంది కాని నల్లగా మారిన ఇనుమును పెద్ద సుత్తితోనే కొట్టాలి. కనుకనే పదార్థమునకు తగిన ప్రయోగము, మన దేశానికి తగినటువంటి ప్రవర్తన అవసరం. మనం భక్తులం అంటున్నాం. భక్తులకు తగినటువంటి భక్తిప్రపత్తులు మనలో ఉన్నాయా ? ఆత్మ విమర్శన చేసుకోవాలి విద్యార్థికి తగినటువంటి ప్రవర్తన విద్యార్థికి వుండాలి అదే విధముగా భక్తులనుకున్నప్పుడు ఆ ప్రవర్తనకు తగినట్లుగా వున్నప్పుడే అతనే నిజమైన భక్తుడు. విద్యార్థికి తగిన వినయ విధేయతలు వుండి నప్పుడే అతను నిజమైన విద్యార్థి ఉపనిషత్తులన్నీ స్థానమునకు తగిన విలువను అందిస్తూవచ్చాయి.

ప్రేమస్వరూపులారా !

స్వామి కఠినంగా చెప్పాడని మీరు బాధపడకూడదు. ఎందుకంటే మనసులో ముదిరిపోయి కరుడుకట్టినటువంటి దానిని కొంతవరకు ఛేదించాలి. ఎంతకాలమైనా తీయని మాటలతోనే పోతుంటే మన కరుడు మరింత పెరిగిపోతుంటుంది. కనుక మనలోనున్న ద్వేషభావములను మనము దూరంగావించుకొని మనలోనున్న స్వార్థ స్వప్రయోజనములను కొంతవరకైనా తగ్గించుకొని, పరోపకార సంబంధమైన కార్యములలో ప్రవేశించి, సేవ ... సేవ ... సేవలు చేయాలి. మానవసేవ చేసినప్పుడే మాధవసేవ అవుతుంది. కనుక సేవలు చేయండి. సత్యాన్ని వదలకండి. ధర్మాన్ని విసర్జించకండి. నిత్యానిత్య పరిశీలనచేసే జ్ఞానాన్ని మీరు పెంచుకోండి.

( ది 23-10-93 న ప్రశాంతినిలయంలో భగవాన్ బాబా చేసిన దివ్య ప్రసంగమునుండి)

# నేనేది చేసినా మీ కోసమే

ప్రేమస్వరూపుడైన పరమాత్మునిపట్ల ప్రేమను పెంచుకోండి. సంకోచాలను, సందేహాలను మీ హృదయంలో చేర నివ్వకండి. ఆయన ప్రేమను గురించి ప్రశ్నలు, అనుమానాలు వద్దు. “నా కష్టాలెందుకు కడతేరలేదు” అని మీరు వ్యథ చెందుతుంటారు. మీ బాధలు నాకు తెలియవని అనుకోవద్దు. నేను మీపట్ల ఉపేక్ష చూపుతున్నానని తలంచవద్దు. నేను మీ తో మాట్లాడకపోయినంత మాత్రాన మీమీద నాకు ప్రేమ లేదని భావించవద్దు. నిజానికి మీకు దర్శనం ఇవ్వటానికే నేను వరండాలో ఈ గది నుండి - ఆ గదికి వెళ్ళుతుంటాను. నేను ఏది చేసినా - అది మీకోసమే గాని నా కోసం కాదు. నాది అనేది ఏమున్నది? మీరే నావారు.

- బాబా

విజయదశమి సందేశం

# నిర్మలమైన ప్రేమతో, విశాలమైన భావంతో సమాజసేవ చేయండి



-భగవాన్ సాయి దివ్యసందేశం

ఈనాడు మానవుడు తన జీవిత పరమావధికి మార్గమేమిటో గుర్తించుకోలేకపోతున్నాడు గుర్తించుకోలేకపోతున్నాననే విచారము కూడా లేకుండాపోతున్నది. జీవితమంటే ఏమిటి? ఇక పరమావధియొక్క లక్ష్యమేమిటి? కడుపువిండా తిండి, కంటినిండా నిద్ర, వంటినిండా బట్ట, ఇంటినిండా పిల్లలు, కళకళలాడే కళత్రం, తళతళలాడే వస్తువాహనాదులే జీవితపరమావధి అని భావించి మురిసిపోతున్నారు ఈనాడు మానవులు. ఇది కొంతవరకు అవసరమే. ఇవన్నీ జీవనోపాధికి సంబంధించినవే గాని, జీవిత పరమావధికి సంబంధించినవి కావు. జీవనోపాధితోపాటు జీవితపరమావధి కూడనూ గుర్తించాలి.

మానవత్వమనేది సామాన్యమైన జీవితం కాదనియు ఇది చాలా విలువైనదనియు, జీవించదగినదనియు, అర్థవంతమైనదనియు గుర్తించాలి. గృహస్థులైన ప్రతి మానవుడు గృహస్థధర్మముతోపాటు, గృహస్థారణ్యములో సంచరించేటటువంటి ప్రతి మానవుడు బృహదారణ్య సంబంధం కూడనూ కొంత గుర్తించాలి. బృహదారణ్య వాసులకు బృహదారణ్య నివాసం అత్యవసరం. ఏమిటి ఈ బృహదారణ్యము? ఇది బృహత్తరమైనటువంటి ఆశ్రమము. వాక్కు, మనస్సు, ఆత్మ - ఈ మూడింటియొక్క సమ్మిళిత స్వరూపమే బృహదారణ్యము. వాక్కు తేజస్సు, మనస్సు అన్నమయం, ప్రాణము రసమయము. తేజోమయమైనటువంటి వాక్కు అన్నమయమైన మనస్సునందు చేరి ప్రాణమయమైన రసముగా రూపొందుతూవచ్చింది దీనినే ఉపనిషత్తులు "రసోవైసః" - ఇదియే బ్రహ్మస్వరూపమన్నారు. ఈ రసతత్త్వం కేవలం ఒక ప్రాణమునందు మాత్రమే ఉంటున్నది. ప్రాణమే ఈ జగత్తుకు మూలాధారము. అయితే ఈ ప్రాణమునకు అతీతమైనటువంటి ఒక ఆత్మ కూడా ఉన్నది. కనుక వాక్కు, మనస్సు, ప్రాణము ఈ మూడింటియొక్క బృహత్తర స్వరూపమే ఈ బృహదారణ్యము. దీనిని నిరంతరం చింతించి, ఆత్మతత్త్వమును గుర్తించి, ఆనందమును అనుభవించడంచేత దీనికి 'అరణ్యము' అని ఒక పేరు వచ్చింది. అరణ్యమునుండి ఆవిర్భవించిన అగ్నికి కూడనూ 'అరణ్యము' అని పేరువచ్చింది. కనుక మానవుని జీవితమునకు అగ్నే ప్రారంభం అగ్నే జీవితం, అగ్నే అంత్యం. తల్లి గర్భాగ్నినుండి పుట్టి, దేహాగ్నిలో జీవించి, కాష్ఠాగ్నితో అంత్యమవుతున్నది ఈ దేహము కనుక జీవితమునకు, జనన మరణములకు అగ్నియే మూలకారణము. ఈ అగ్నియే దివ్యస్వరూపము. అగ్నియే తేజోమయము, సమస్త ప్రపంచమును కాపాడునది అగ్నియే. అయితే ఈ అగ్నికి కొంత పరిమితం కావాలి. 'న శ్రేయో నియమం వినా' దేనికైనా కొంత నియమం ఉండాలి. అగ్ని స్వరూపమయిన బ్రహ్మతత్త్వమును గుర్తించే నిమిత్తము ప్రాచీనకాలమున యజ్ఞయాగాదులు ప్రారంభిస్తూవచ్చారు. మనోభీష్టాన్ని నెరవేర్చుకొనే నిమిత్తం కాదు వాంఛలు చెల్లించుకొనే నిమిత్తంకాదు. బాధలను

పోగొట్టుకొనే నిమిత్తంకాదు. కష్టములను విసర్జించే నిమిత్తం కాదు. కేవలం ఆత్మానందమును పొందే నిమిత్తమే యజ్ఞయాగాదులు ప్రారంభించారు.

ఒకానొక సమయంలో జనకమహారాజు గొప్ప యజ్ఞమును ప్రారంభించాడు ఈ యజ్ఞమునకు మహా మహా పండితోత్తములందరూ వచ్చారు. ఇందులో మహా పండితులైన మైత్రేయ, శాండిలిని, గర్గి మొదలైన స్త్రీలుకూడా వచ్చారు ఇలాంటి పండితుల సభలో 'అశ్వరుడు' అనే మహర్షి యాజ్ఞవల్క్యుణ్ణి ప్రశ్నిస్తూ వచ్చాడు. "దేవతలు ఎంతమంది ఇక్కడ ?" అని ప్రశ్నించాడు యాజ్ఞవల్క్యుడు 'ఇక్కడ' అనే పదమును ఆధారముగా తీసుకొని 3306 అని చెప్పాడు. ఇంతమంది దేవతలు ఇక్కడ ఉన్నారా ? అని సభ అంతా ఆశ్చర్యపోయింది. యాజ్ఞవల్క్యుని ఉద్దేశ్యమేమిటి ? ఆ సభలో పాల్గొనిన ప్రతి వ్యక్తి దైవ స్వరూపుడేనని అతని అభిప్రాయం. 'దైవం మానుష రూపేణ' అనాడు వారు ప్రతి వ్యక్తినీ భగవత్ స్వరూపుడుగానే భావించేవారు. తిరిగి మరొక ప్రశ్న వేశాడు 'అశ్వరుడు'. ఈ 3306 దేవతల లోపల కొంతవరకు తగ్గించడానికి వీలుంటుందా యాజ్ఞవల్క్యా ? అని ప్రశ్నించాడు తప్పకుండా తగ్గించవచ్చునన్నాడు యాజ్ఞవల్క్యుడు అయితే ఎంతమంది దేవతలు ? అక్కడ 'ఇక్కడ' అనే పదములేదు 33 మంది దేవతలున్నారని సమాధానం చెప్పాడు యాజ్ఞవల్క్యుడు. వారిని గురించి వివరించమన్నాడు అశ్వరుడు వసువులు-8, రుద్రులు-11, ఆదిత్యులు-12, ఇంద్రుడు, ప్రజాపతి—వీరందరూ చేరితే మొత్తం 33 మంది అని చెప్పాడు అయితే సరియని సభలోని వారందరూ తలలూపారు. ఇంతలో "గర్గి" లేచి పండితోత్తమా! వీరిని కొంతవరకు తగ్గించడానికి సాధ్యమా" అని అడిగింది. తప్పక సాధ్యమవుతుందని చెప్పి 'ఆరు మంది' అన్నాడు యాజ్ఞవల్క్యుడు ఎవరు ? అని అడిగారు అప్పుడు 1. అగ్ని 2. పృథ్వి 3. వాయువు 4. ఆదిత్య 5. అమరత్వము 6. అధ్వరము— ఈ ఆరుమంది నిజమయిన దేవతలని చెప్పాడు. తిరిగి అశ్వరుడు లేచి ఈ ఆరుమందిలో కొంతవరకు తగ్గించవచ్చునా ? అని అడిగాడు. తప్పక తగ్గించవచ్చునని యాజ్ఞవల్క్యుడు చెప్పి వారు ముగ్గురు మాత్రమేనని, వారే భూతభవిష్యత్తు వర్తమాన కాలములని పేర్కొనినాడు వీరినికూడా ఏమైనా తగ్గించవచ్చునా ? అని అడిగారు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు రెండు అని చెప్పి అన్నము, ప్రాణము అన్నాడు. అయితే ఈ రెండులో ఏమైనా తగ్గించవచ్చునా ? అని అడిగారు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు 1 1/2 దేవుడన్నాడు. దీని అర్థమేమిటని అడిగారు. గాలి సర్వ పదార్థములయందునూ యిమిడి ఉంటున్నది. సర్వత్రా నిండినటువంటి ఈ గాలికి 'అద్వర్తము' అన్నాడు. 'అద్వర్తము' అనగా 1 1/2 అని దీని అర్థము. అయితే ఈ 1 1/2 నుంచి కూడా ఏమైనా తగ్గించవచ్చునా ? అని అడిగారు. తగ్గించవచ్చునని చెప్పి 'ప్రాణము' ఒక్కటే అని యాజ్ఞవల్క్యుడు చెప్పాడు. అన్నిరకములుగా ఆలోచించిన తరువాత కట్టకడపటికి 'ప్రాణము' అనేటటువంటిది ఒక్కటే అంత్యదేవుడుగా నిలిచాడు

ఈ ప్రాణతత్త్వము ఎక్కడ ఉంటున్నది ? ప్రాణమునకు ఒక స్థానము, ఒక కాలము, ఒక దేశములేదు. సర్వత్రా ఉంటున్నది. ఇట్టి సర్వత్రా ఉండినటువంటి ప్రాణప్రతిష్ఠనే ప్రధానమైన 'యజ్ఞము' అన్నాడు. యజ్ఞమనగా ఏమిటి ? కేవలం ఒక హోమంలో సమిధలను అర్పించడమేకాదు. యమ

పోగొట్టుకొనే నిమిత్తంకాదు. కష్టములను విసర్జించే నిమిత్తం కాదు. కేవలం ఆత్మానందమును పొందే నిమిత్తమే యజ్ఞయాగాదులు ప్రారంభించారు.

ఒకానొక సమయంలో జనకమహారాజు గొప్ప యజ్ఞమును ప్రారంభించాడు ఈ యజ్ఞమునకు మహా మహా పండితోత్తములందరూ వచ్చారు. ఇందులో మహా పండితులైన మైత్రేయి, శాండిలిని, గర్గి మొదలైన స్త్రీలుకూడా వచ్చారు ఇలాంటి పండితుల సభలో 'అశ్వరుడు' అనే మహర్షి యాజ్ఞవల్క్యుణ్ణి ప్రశ్నిస్తూ వచ్చాడు. "దేవతలు ఎంతమంది ఇక్కడ ?" అని ప్రశ్నించాడు యాజ్ఞవల్క్యుడు 'ఇక్కడ' అనే పదమును ఆధారముగా తీసుకొని 3306 అని చెప్పాడు. ఇంతమంది దేవతలు ఇక్కడ ఉన్నారా ? అని సభ అంతా ఆశ్చర్యపోయింది. యాజ్ఞవల్క్యుని ఉద్దేశ్యమేమిటి ? ఆ సభలో పాల్గొనిన ప్రతి వ్యక్తి దైవ స్వరూపుడేనని అతని అభిప్రాయం. 'దైవం మానుష రూపేణ' అనాడు వారు ప్రతి వ్యక్తినీ భగవత్ స్వరూపుడుగానే భావించేవారు. తిరిగి మరొక ప్రశ్న వేశాడు 'అశ్వరుడు'. ఈ 3306 దేవతల లోపల కొంతవరకు తగ్గించడానికి వీలుంటుందా యాజ్ఞవల్క్యా ? అని ప్రశ్నించాడు తప్పకుండా తగ్గించవచ్చునన్నాడు యాజ్ఞవల్క్యుడు అయితే ఎంతమంది దేవతలు ? అక్కడ 'ఇక్కడ' అనే పదములేదు 33 మంది దేవతలున్నారని సమాధానం చెప్పాడు యాజ్ఞవల్క్యుడు. వారిని గురించి వివరించమన్నాడు అశ్వరుడు వసువులు-8, రుద్రులు-11, ఆదిత్యులు-12, ఇంద్రుడు, ప్రజాపతి—వీరందరూ చేరితే మొత్తం 33 మంది అని చెప్పాడు అయితే సరియని సభలోని వారందరూ తలలూపారు. ఇంతలో "గర్గి" లేచి పండితోత్తమా! వీరిని కొంతవరకు తగ్గించడానికి సాధ్యమా ". అని అడిగింది. తప్పక సాధ్యమవుతుందని చెప్పి 'ఆరు మంది' అన్నాడు యాజ్ఞవల్క్యుడు ఎవరు ? అని అడిగారు అప్పుడు 1. అగ్ని 2. పృథ్వి 3. వాయువు 4. ఆదిత్య 5. అమరత్వము 6. అధ్వరము— ఈ ఆరుమంది నిజమయిన దేవతలని చెప్పాడు. తిరిగి అశ్వరుడు లేచి ఈ ఆరుమందిలో కొంతవరకు తగ్గించవచ్చునా ? అని అడిగాడు. తప్పక తగ్గించవచ్చునని యాజ్ఞవల్క్యుడు చెప్పి వారు ముగ్గురు మాత్రమేనని, వారే భూతభవిష్యత్తు వర్తమాన కాలములని పేర్కొనినాడు వీరినికూడా ఏమైనా తగ్గించవచ్చునా ? అని అడిగారు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు రెండు అని చెప్పి అన్నము, ప్రాణము అన్నాడు. అయితే ఈ రెండులో ఏమైనా తగ్గించవచ్చునా ? అని అడిగారు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు 1 1/2 దేవుడన్నాడు. దీని అర్థమేమిటని అడిగారు. గాలి సర్వ పదార్థములయందునూ యిమిడి ఉంటున్నది. సర్వత్రా నిండినటువంటి ఈ గాలికి 'అధ్వర్తము' అన్నాడు. 'అధ్వర్తము' అనగా 1 1/2 అని దీని అర్థము. అయితే ఈ 1 1/2 నుంచి కూడా ఏమైనా తగ్గించవచ్చునా ? అని అడిగారు. తగ్గించవచ్చునని చెప్పి 'ప్రాణము' ఒక్కటే అని యాజ్ఞవల్క్యుడు చెప్పాడు. అన్నిరకములుగా ఆలోచించిన తరువాత కట్టకడపటికి 'ప్రాణము' అనేటటువంటిది ఒక్కటే అంత్యదేవుడుగా నిలిచాడు

ఈ ప్రాణతత్త్వము ఎక్కడ ఉంటున్నది ? ప్రాణమునకు ఒక స్థానము, ఒక కాలము, ఒక దేశములేదు. సర్వత్రా ఉంటున్నది. ఇట్టి సర్వత్రా ఉండినటువంటి ప్రాణప్రతిష్ఠనే ప్రధానమైన 'యజ్ఞము' అన్నాడు. యజ్ఞమనగా ఏమిటి ? కేవలం ఒక హోమంలో సమిధలను అర్పించడమేకాదు. యమ

నియమాదులతో ఆచరించడమే "యజ్ఞము" అన్నారు. ఈ జ్ఞానమంతా కేవలం భౌతికమైన జ్ఞానమేనన్నారు. యమనియమాదులు ఆచరించేది దేహముతోనే. దేహము అనిత్యమైనటువంటిది నీటిబుడగ వంటిది కనుక ఇది సత్యమెట్లా అవుతుంది ?

ఇంక 'జ్ఞానము' అంటున్నారు. ఈ జ్ఞానము కూడనూ నిజమైన జ్ఞానము కాదు. అజ్ఞానముతోకూడిన జ్ఞానము అన్నారు. జ్ఞా=జ్ఞానము; న=కాదు. జ్ఞానము కానిది. ఇది జ్ఞానము కాదని అర్థము. ఏది జ్ఞానం? ఆత్మజ్ఞానమే జ్ఞానము. కేవలం ఇంద్రియములచేత, తెలివితేటలచేత అనుభవించేటటు వంటి జ్ఞానములన్ని మిథ్యాజ్ఞానములే. జీవ దేవుడేననే టటువంటిది ఎండానీడలవలె వుంటున్నాది ఎంత వుంటేనే నీడ. నీడలోకూడా ఎండ ఉన్నది. కనుక ఈ రెండింటియొక్క తత్త్వమే ఈ జగత్తు. దీనినే ద్వైతము అన్నారు. ఈ జగత్తంతా ద్వైతస్వరూపమే. ఈ ద్వైతస్వరూపమైనటువంటి జగత్తునందు, ఎట్టి జ్ఞానము మనం సంపాదించినప్పటికినీ—ఇవి అజ్ఞానము క్రిందనే రూపొందుతాయి. ఈ జ్ఞానము అనేక వాదోప వాదములకు పనికి వస్తుంది. తర్కములకు ఉపయో గిస్తూ వుంటారు. "వాదేవాదే వజతే వైరం" ఈ వాదన వలన వైరం పెరుగుతూ వుంటుంది. వాదన కానిది, బేధము లేనిది, రెండోది కానిది, తేజస్సు వెలుగునది, సర్వత్రా వ్యాపించునది– అదియే నిజమైన ఆత్మజ్ఞానము. అట్టి ఆత్మజ్ఞాన నిమిత్తమై ప్రాచీన కాలమునందు మహర్షులు యజ్ఞ యాగాదులు నలుపుతూ వచ్చారు మానవునియొక్క ఉనికిని గుర్తించే నిమిత్తమై యజ్ఞములు ఆచరిస్తూ వచ్చారు. జీవిత పరమావధిని తెలుసుకొనే నిమిత్తమై యజ్ఞములు ప్రారంభించారు. అయితే ఈనాడు ఏదో ఒక లలితా సహస్ర నామమో, విష్ణుసహస్రనామమో, ఏదో ఒక పారాయణమో చేసుకుంటూ– ఇదే యజ్ఞములోపల కాలమును సార్థకం చేసుకున్నట్లుగా భావిస్తున్నాం. ఇవన్నీ చేయదగినవే అయితే మనం దీనివలన అందుకొనేది ఏమాత్రంలేదు అప్పటికప్పుడు తాత్కాలిక ఆనందమును అందుకోవచ్చును శాశ్వతానందమును పొందటానికి ఇవి ఏమాత్రం కారణం కావు తనలో తాను ఆత్మతత్త్వమును చక్కగా విచారణ సలిపి, విమర్శించి, పరిశోధన సలిపి, పరిశీలించి దానిని పర తత్త్వంగా అనుభవించాలి. ఇదియే నిజమైన ఆత్మ జ్ఞానం. కనుక ఇట్టి ఆత్మజ్ఞానముకోసం ఏ గ్రంథములూ మనం చదువనవసరంలేదు. కాని అనుభవజ్ఞులద్వారా కొంతవరకు సత్యమును గుర్తించి, దానిని సాధనలో నిమిడ్చి, మన స్వప్రయత్నంచేతనే దీనిని సాధించాలి.

మానవత్వంలో ఒక విధమైన దివ్యానుభూతి ఉంటున్నది. మనం ఏ పదార్థమును ఆశించినా, ప్రేమిం చినా, ఆ పదార్థము నిమిత్తముకాదు. ఆ పదార్థమును ఆశించడం నీ అభీష్టము నిమిత్తం ఆ పదార్థమును ఆశిస్తున్నావు ఏ వ్యక్తిని మనం ప్రేమిస్తున్నప్పటికీ, ఆ వ్యక్తియొక్క ప్రేమనిమిత్తమై ఆ వ్యక్తిని మనం ప్రేమించడంలేదు. నీ ప్రేమ నిమిత్తమై ఆ వ్యక్తిని నీవు ప్రేమిస్తున్నావు అదే విధముగనే ప్రపంచములో ప్రతి ఒక్కటి కూడనూ, తన నిమిత్తమై తాను ప్రేమిస్తూ, దుఃఖిస్తూ, విచారిస్తూ, ఆనందిస్తూ వుంటున్నాడు కనుక తన విచారమునకు తానే కారణం. తన ఆనందమునకు తానే కారణం. తన యొక్క సంతృప్తికి తానే కారణం. కారణం తానే కనుక పర తత్త్వమును మొట్టమొదట గుర్తించాలి. ఇది గ్రంథము లలో లేదు.

మానవ జీవితమనేటటువంటిది నీటి బుడగవంటి దేహమును ధరించి, పిచ్చికోతివంటి మనస్సును ధరించి కాలమును వ్యర్థముగావిస్తూ, అంత్యము రాగానే కాయమును విసర్జించటమే జీవితముయొక్క పరమావధని భావిస్తున్నారు కిరణ, కారణ కర్మలతో కూడినటువంటి యొక్క జీవితసత్యమును మొట్టమొదట గుర్తించాలి. ఈ జగత్తులో ఏదీ శాశ్వతముకాదు ఎప్పుడో? ఎక్కడో ? ఏమవుతుందో ? కాని ఉండినంతవరకు మాత్రం సంతృప్తిగా జీవించాలి. ఆ సంతృప్తి ఎక్కడనుంచి మనకు వస్తుంది ? అది ఒక్క దైవచింతనచేత తప్ప అన్యచింతనచేత మనకు ప్రాప్తించదు. యావత్ ప్రపంచమూ భగవత్ స్వరూపమే. భగవంతుడు లేనటువంటి స్థానమేలేదు ఇలాంటి ఏకత్వమును మనం అనుభవించాలి

బృహదారణ్యమునందు ఇది కేవలం 'ఓం' కార నాదము యొక్క దివ్యశక్తిగా ప్రబోధిస్తూవచ్చింది. ఎక్కడ చూచినా ప్రణవనాదమే. ఒక ఎలక్ట్రికల్ స్తంభం దగ్గరకు వెళ్ళి కొట్టు, 'ఓం' అని ప్రణవం చేస్తుంది నీవు వంటరిగా కూర్చొని నీ రెండు చెవులూ గట్టిగా మూసుకో ! అప్పుడు కూడా 'ఓం' అనే శబ్దము వినిపిస్తుంది సర్వత్రా ఉండినటువంటిది ఈ ప్రణవ నాదమే. ఈ ప్రణవనాదమును మనం చక్కగా దైవత్వంగా విశ్వసించినప్పుడే, ఏ విచారమునకు మనకు అవకాశంలేదు. ఈ ప్రాకృతమైన లోకములో అనేక విధములైన కష్టములు, నష్టములు, దుఃఖములు మనలను వెంటాడుతూ ఉంటాయి, ఎంతవరకు ఇవి ? దేహాభిమానం ఉండినంతవరకే ఈ కష్టములు, దుఃఖములు వచ్చే సమస్త దుఃఖములన్నియూ దేహమునకు సంబంధించినవే గాని, ఆత్మకు సంబంధించినవి కావు ఈ దేహము కేవలం పంచభూతములతో కూడినటువంటిది.

" పాంచ భౌతికము దుర్బలమైన కాయంబు
ఎప్పుడు కూలుట తప్పదెందు
శతవర్షముల దాక మితము చెప్పిరి కాని
నమ్మరాదామాట నమ్మనమున
బాల్యమందో మంచి ప్రాయమందో కాక
ముదిమియందో లేక ముసలి యందో
ఊరనో అడవినో ఉదక మధ్యంబునో
ఎక్కడో విడిచేది ఎఱుక లేదు
మరణమే నిశ్చయమ్మది మానవునకు
దేహమున్నంతలో తాను తెలియవలయు "

ఈ దేహమున్నంతలోపలనే ఈ సత్యమును మనం గుర్తించాలి. ఎప్పుడో విచారిస్తామంటే అప్పటివరకు ఈ దేహముంటుందా ? ఇది నీటిబుడగవంటిది.

" నీటియందె పుట్టి నీటనే తేలుచు
నీటియందడంగు నీటి బుడగ
నరుడు బుద్బుదంబు నారాయణుడు నీరు "

ఆ నీటినుంచే వచ్చింది ఈ బుడగ ఆ నీరే నారాయణుడు, బుడగే దేహము. కనుక నారాయణుని లోనే లీనమైపోతుంది. కనుక ఇలాంటి ఆత్మజ్ఞానమును ప్రబోధించేటటువంటివే యజ్ఞయాగాది క్రతువులు కాని ప్రాకృతమైనటువంటి జీవితం గడిపేటటువంటివారు, దేహాన్ని గురించి, నిందలకు నిష్ఠూరములకు లొంగి, అనేక విధములైన విచారములకు గురిఅవుతూవుంటారు. కేవలం ఒకర్ని బాధించడమే వారి ప్రధానమైనటువంటి కర్తవ్యంగా వుంటూవుంటుంది మంచిని కూడా చెడ్డగా మారుస్తుంటారు ఇలాంటి జీవితం గడిపేటటువంటి వారికి ఇంకొక మార్గమేలేదు. అధోగతి తప్ప. కనుక మాధవ తత్త్వాన్ని కొంతవరకు అర్థం చేసుకొని మెలగాలి. మంచిని చూడక చెడ్డనే చూచేటటువంటివారు

చాలా మంది ఉంటుంటారు. ఇంకా కొంతమంది చెడ్డనే చూస్తూ మంచిగా భావించేటటువంటివారుంటారు. ఈ రెండు తత్త్వములూ అసత్యములే. ఎప్పుడూ మంచిని చూచేటటువంటి వాడిదే నిజమైన దివ్యదృష్టి. కనుక మానవత్వంలో మనం చెడ్డను ఏమాత్రం చింతించరాదు. ఒకవేళ మనలను ఇతరులు నిందించినప్పటికినీ మనము దమముతో శాంతంగా ఉండాలి. దానికుండినంత శక్తి మరొక దానికిలేదు. అలాంటి శాంతిని మనం అభివృద్ధి పరచుకోవాలి. శాంతిని మనం ఎంత పెంచుకుంటామో, అంత మనకు ఆయుఃప్రమాణం కూడా పెరుగుతుంది. అయితే మనం ఇప్పుడు శాంతిని కోల్పోతున్నాం. ఎవరైనా, ఏమైనా అంటే ఒక్క నిముషం లోపల మనం మండిపోతున్నాము.

"తప్పుగానక సర్వమొప్పుగా భావించి
ప్రకటించుచుందురు పరుష జనులు
తప్పులే గైకొని ఒప్పులు దిగ్రదొక్కి
ప్రకటించుచుందురు ప్రాప్తజనులు
ఒప్పులన్నియు బల్మి తప్పులుగామార్చి
కలహించుచుందురు కలుష జనులు
ఒప్పులే దిగ్రదొక్కి తప్పుల నెక్కించి
దూషించుచుందురు దుష్టజనులు
మొదటి మూడింటివారి కొక విధము కలదు
నాల్గవ లక్షణమందున నరుని నరయ
ఇతని కంటెను ఘనరాక్షసుండె మేలు"

ఈనాడు మంచిని కూడా చెడ్డగా మార్చేటటువంటి రాక్షసులు అధికమైపోతున్నారు. ఇదంతా కేవలం "వినాశకాలే విపరీత బుద్ధిః" వారి వినాశమునకు తగిన పునాదులే ఇవి. ఒకానొక సమయమున బలరామ కృష్ణులు ఇద్దరూ సంభాషిస్తూ వచ్చారు. బలరాముడు అడిగాడు ఈనాడు ప్రపంచంలో జరగరానివన్నీ జరుగుతున్నా యేమిటని అడిగాడు. "ఎక్కడో కాదు కౌరవులలో పాండవులలోనే కాదు మన యాదవ కులంలో కూడా ఇలాంటి విప్లవం బయలుదేరుతున్నదే? ఒకరినొకరు కలహించుకుంటున్నారు. లేని ద్వేషమును పుట్టిస్తున్నారు. అనవసరమైన కలహాలకు కాలు ద్రువ్వుతున్నారు ఏమిటి?" అని అడుగగా అప్పుడు శ్రీకృష్ణుడు "ఇది కలి ప్రభావం అన్నా!" అన్నాడు. రాబోయేది కలికాలం. దాని చిహ్నములన్నీ ఇప్పుడే కనిపిస్తుండాలన్నాడు. ఈ వినాశ బుద్ధులన్నీ విపరీత కాలంకోసంమేనన్నాడు. కనుక ఈనాటి విపరీత బుద్ధులన్నీ కూడనూ వినాశ కాలమునకే. కాలం మన చేతిలోనే ఉంటుంది. కనుక మనలో వినాశనాశనం లాంటి బుద్ధులు రాకూడదు. ఎప్పుడునూ నిరంతరమైన శాంతి భావములనే మనలో అభివృద్ధిపరచుకోవాలి. ఎవరినైనా మనం బాధించడానికి తగిన ప్రయత్నం చేసేముందు, నిత్యానిత్య విషయాలను పరిశీలనచేయాలి. మనం ఒక విషయాన్ని ప్రచారం చేయాలనుకుంటే ఇది నిజమా? కాదా? అనేటటువంటి కాలాన్ని తీసుకోవాలి, ఎవరో బజారునపోయే Begger (బిచ్చగాడు) చెప్పే విషయాలను విని ప్రచారం చేయకూడదు. ఆ Begger (బిచ్చగాడు) చేసేటటువంటి ప్రచారం Beggerly (హీనమైన) గానే వుంటుంది. Begger ఎన్నటికీ Bigger కాలేడు. Bigger (గొప్పవాడు, పెద్దవాడు) అయినటువంటివాడు సత్యమును విచారించాలి. కాలాన్ని తీసుకోవాలి. సత్యానిత్య విషయాన్ని పరిశీలన చేయాలి. తెలియనంత వరకు కాలాన్ని తీసుకోవాలి. అంతేగాని ఏదో

ఒకటి తెలిసిన తక్షణమే ఇది ఇట్టిది, అట్టిది, అని నిర్ణయం చేసుకోవటం కేవలం తెలివి తక్కువపని. ఇలాంటివన్నీ జరగటం దేనికోసం? మంచిని పెంచడం కోసమే జరుగుతుంటాయి. పవిత్రతను అభివృద్ధిగావించే నిమిత్తమే జరుగుతుంటాయి. ఒక దగ్గర పెద్ద గుంట తవ్వుతున్నామంటే, ఆ గుంట తవ్విన మట్టి ప్రక్కనే ఒక పెద్ద గుట్టగా పెరుగుతుంటుంది. కనుక తగ్గుమిట్టలనేటటువంటివి ఇవి కేవలం ప్రాకృతమైన చర్యలే. కనుక దైవత్వంలో మాత్రం ఇలాంటివి ఏమైనా కొన్ని జరిగినప్పుడు ఇది ఉన్నతస్థాయికి అందుకొనేటటువంటి పవిత్రతకే మూలకారణము.

పాండవులు, కౌరవులు 18 దినములు యుద్ధం చేసారు. కాని మొదటి తొమ్మిది దినములు పాండవులు ఓడిపోతూవచ్చారు. ధర్మజునిలో, అర్జునిలో ఉత్సాహం క్షీణించింది, కృష్ణుడు చెప్పాడు. "ఎందుకోయి బావా! ఇంత బాధ పడుతావు. అధర్మానికి మొట్టమొదట కొన్ని విజయాలు చేకూరుతుంటాయి క్రమక్రమేణా అవి అణిగి సత్యం, శాంతి, పవిత్రత పైకి వస్తాయి. కనుక నీవేమీ విచారించనవసరంలేదు. "లెమ్ము! ధనుంజయ! విధి బలీయం. న్యాయము గెలుచు, గతించు స్వార్థము. సదా విషంబ వివేకమోయి. చూడు! నూర్గురు బిడ్డల తండ్రికైనా అంత్యమ్మున పిండమిడు దిక్కు కలగరట ప్రారబ్ధము దేమిటో!" కారణమేమిటి? కుయుక్తులు పన్నేటటువంటివారుంటారు, సంకుచితమైన హృదయాలు కలిగినటువంటివారుంటుంటారు. వారికి ఇంత కన్నా దమ్మిడీపని ఉండదు. మానవత్వంలో హీనమయినటువంటి గుంపులు కొన్ని చేరుతుంటాయి. కనుకనే "పచ్చని రాజవంశమును పాడొనరింప జనించినారు, దానిపై కచ్చలు రేపె ఆ శకుని గాడు, రగుల్కొనే మంట మింట ఇవ్వొచ్చును వింట, ఇంక శరవర్షము తప్పదు విశ్వశాంతికిన్" పాండవులయొక్క మంచిని చూచి కౌరవులు ఓర్చుకొనలేకపోయినారు. పాండవులు ధర్మమూర్తులు. వారిలో కించిత్ అసత్యముకూడా లేదు. ద్రౌపదిని పరాభవం చేస్తుంటే బలశాలి అయిన భీముడు, ఎన్నో బిరుదులు పొందిన వీరుడైన అర్జునుడులాంటి శక్తివంతులు వుండి కూడనూ వారు ఏమీ తొందరపడలేదు. ఆనాడు ఒక్క భీముడే గనుక చెలరేగివుంటే కౌరవులందరూ భస్మమైపోయి ఉండేవారు. కాని శాంతం వహించారు. జరుగవలసింది జరగాలి. కనుక ఇవన్నియూ మన భవిష్యత్తుకు ఉన్నత గుణమును చేకూర్చేటటువంటివే. "పచ్చని రాజవంశమును పాడొనరింప జనించనారు" అదేవిధముగ సాయి సంస్థలు కళకళలాడుతూ యావత్ ప్రపంచమంతా వ్యాపించి దివ్యతేజస్సుతో ప్రకాశిస్తుంటే చూచి ఓర్వలేక కౌరవుల మాదిరి కొందరు అసూయాపరుల దృష్టి పడింది. "దానిపై కచ్చలు రేపె ఆ శకునిగాడు". దీనికి తోడు శకుని లాంటివారు కొందరు ఉంటునే వుంటుంటారు. 'గంతకు తగిన బొంతలే'. అట్టివారిని తెలివితేటలు గలవారనిగాని, విద్యావంతులనిగాని, మేధావంతులనిగాని ఎవరూ చెప్పరు. అట్టివారే అయితే ఇలాంటి చిల్లర విషయాలలో పాల్గొననే పాల్గొనరు. వారి చర్యలనుబట్టే వారెంతటి చిల్లరవారో అర్థమవుతునే ఉన్నది. అంతే కాదు "రగుల్కొనె మంట మింట ఇవ్వొచ్చును వింట." యావత్ ప్రపంచమంతనూ యిది ప్రాకిపోయింది. కట్టగడపటికి ఏమైపోయింది? అంతా శరవర్షముతో తగ్గిపోయింది. తనయొక్క అస్త్రములే

తనకు విరుద్ధంగా మారిపోయినాయి ఆ విరుద్ధమైన అస్త్రములే వారిని తిరిగి హింసించాయి. అప్పుడే పాండవులకు విజయం చేకూరింది కనుక అదే విధముగనే, అతి స్వల్పకాలము లోపలనే సాయియొక్క ప్రభావం యావత్ ప్రపంచమంతా వ్యాపించిపోతుంది గడచిన దానికంటే వెయ్యిరెట్లు అధికంగా మారిపోతుంది కారణము మనమంటే మనలో ఏ దోషమూ లేదు చేసేదంతా పవిత్రమైన కార్యములు. చెప్పేవన్నీ సత్యమైన పలుకులు ఆచరించేదంతా అనన్యమైన ఆత్మతత్త్వమునకు సంబంధించినవి. కనుక ఇలాంటి దానికి మనం వెరువనవసరంలేదు.

పంటను కోసి తూర్పారపట్టినప్పుడు గట్టిగింజలు క్రిందపడుతాయి తాలు, తప్ప గాలికి లేచిపోతాయి. ఈ మార్పువలన నిజమైన భక్తులంతా గట్టిగా నిలుస్తారు అటూ ఇటూ ఊగిసలాడే తోలుబొమ్మలు కొట్టుకొనిపోతారు. ఇది కేవలం తూర్పారపట్టినట్లుగా ఉంటుంది. కనుక మనలోనున్న సత్యమును మనం ఏమాత్రం మార్చుకోకూడదు. కనుక మనం ఎలాంటిదానినైనా ఎదుర్కొనడానికి సిద్ధంకావాలి. "Life is A Challenge, Meet it". కనుక దీనిని ఎదుర్కొనటానికి ప్రయత్నించాలి, ఎట్లా ఎదుర్కోవటం ? "మాటకు మాట వేటుకు వేటు కాదు" ఎవరినీ మనం నిందించనవసరంలేదు. ఎవరినీ మనం బాధించనవసరం లేదు. మన సత్యాన్ని మనం వదలకుండాఉండాలి. ఆ విశ్వాసమే నిజమైన భక్తులయొక్క శ్వాసగా భావించాలి. కనుక మీరు ఈ భక్తిప్రపత్తుల తత్త్వమునందు విశ్వాసమును మాత్రం దృఢంగా వుంచుకోవాలి.

అసూయాపరులు ఎన్నో రకములైన కట్టుకథలు పుట్టిస్తారు. ఈ అసూయకు తగిన ద్వేషం మరింత రెచ్చగొడుతారు. వీరంతా శకుని యొక్క సంతతివారే. ఈ శకుని సంతతి ఎవరివద్ద చేరుతుంది ? దుర్యోధన, దుశ్శాసనాదుల వద్దనే చేరుతుంది ధర్మజుడు, పాండవుల వద్ద జేరదు. ఇలాంటి దుర్యోధన దుశ్శాసనులతో కూడిన శకునితత్త్వము ఏనాటికైనా నాశనమేఅవుతుంది. మంచికి ఏనాటికీ లోటురాదు. తప్పు ఏనాటికీ పెరగదు కనుక మనం యీ సత్యం లోపల జీవితాన్ని అభివృద్ధి పరచుకోవాలి.

## ప్రేమస్వరూపులారా !

సమయము చిక్కిన తప్పదు, తిరిగి చిక్కదు. ఈ అవకాశమును పురస్కరించుకొని, సాయి సంస్థలను దిన దినాభివృద్ధిని గావించండి. వీధివీధిన సాయి నామం మారుమ్రోగాలి. ప్రతి హృదయమును పవిత్రం చేయాలి. ప్రతి మనిషి సుఖసంతోషములతో జీవించాలి. నీ విరోధులను కూడనూ నీవు ప్రేమించు. నీ ద్వేషులను కూడనూ నీవు నీ అంతరంగిక స్నేహితులుగా విశ్వసించు. తప్పులేదు మనం ఎవ్వరినీ నిందించనక్కరలేదు. మన సత్యాన్ని మనం నమ్మి, మన సత్యాన్ని మనం అనుసరించినప్పుడు సత్యం విజయం. సత్యం ఒక్కటే. ఇలాంటి సత్యంతో మనంజీవితాన్ని గడపాలి.

అందరం కలిశాం గనుక 70 వ జన్మదినం లోపల జరుగవలసిన కార్యక్రమాలన్ని నిర్ణయం చేసుకున్నాం. ఏమి జరిగినా, యివి మాత్రం మానవు. సాయి సంకల్పం జరిగే తీరాలి. ఆకాశం ఊడి మూడు ముక్కలుగా పడినప్పటికీ ఈ సంకల్పం మారదు. అయితే యీ సంకల్పాలను ఎప్పుడూ మేము ప్రచారంచేస్తూ వుండము, బహిరంగపరస్తూ రాం. దేనికి Advertise చేస్తారు ? ఖర్చుగాని వస్తువునే Advertise చేస్తారు. ఖర్చయ్యే వస్తువుకు Stock ఉండదు. దీనికి ఇంకా Advertise ఎందుకు ? కనుక ఈ రెండు సంవత్సరముల లోపలనే అనేక విధములైన ఘనకార్యములు

జరుగుతాయి. బీద పేద సాదల తత్త్వాన్ని చక్కగా గుర్తించడానికి ప్రయత్నిస్తాం ఈ నవంబర్ 18 వ తేదీననే 70 వివాహములు చేస్తున్నాం. అవి సామాన్యంగా జరుగవు వారు ఆశ్చర్యపడే విధంగా చేస్తాం. బంగారు తాళిబొట్టు గొలుసుకూడా ప్రతి పెండ్లికూతురికి యిస్తాం పెండ్లికొడుకులకు ఉంగరాలు యిస్తాం. వారికి భోజన సామాగ్రికి అవసరమైన వంటసామాన్లు కూడ యిస్తాం కంచిచీరెలు యిస్తాం. ఇంతేకాక వారుండటానికి గృహాలుకూడా కట్టిస్తున్నాం. కుట్టు మిషన్లుకూడా స్త్రీలకు యిస్తాం. స్వదేశంలో లభ్యమయ్యే కుట్టుమిషన్లు కావు. ఆధునికమైన ఆటోమాటిక్ మిషన్లు విదేశాలనుంచి తెప్పిస్తున్నాం. పనిలేని వారికి ఆటోలుకూడా యిస్తాం. ట్రాక్టర్సుకూడా యిస్తా

ఈ పనులు ఏ ప్రభుత్వం జేస్తున్నది? ఏ వ్యక్తులు చేస్తున్నారు? అందరూ చెప్పేవారే గాని చేసేవారు లేరు. నిజంగా ఇక్కడికివచ్చి విజ్ఞానంతో చూచేవారికి యిక్కడ చేస్తున్న అభ్యుదయ కార్యక్రమాలు తెలుస్తాయిగాని, ఎక్కడెక్కడో వుండి అజ్ఞానంతో మాట్లాడే వారికి ఏమీ తెలియదు 30 సంవత్సరములకు పూర్వం ఈ పుట్టపర్తి కుగ్రామం. కాని యీనాడు గొప్ప పట్టణంగా మారిపోయింది. దీనిని ఎవరు మార్చగలరు? మా ఇల్లు మేము కట్టుకున్నామని వారు చెప్పవచ్చు ఆ ఇల్లు కట్టుకోవటానికి ఆ ధనం ఎక్కడ నుంచి వచ్చింది? మా ప్రశాంతి నిలయమునకు భూమి కొనే సమయంలో ఆనాడు ఒక ఎకరం కేవలం రెండువందల రూపాయలు మాత్రమే. ఈనాడు ఒక సెంటు ఎనభైవేలు. ఈ వెల ఎవరి వలన పెరిగింది? సాయిబాబా వలన పెరిగిందా? నీ వలన పెరిగిందా? మా భూములు అమ్ముకున్నాం, మా ఇళ్ళు మేము కట్టుకున్నామని చెబుతుంటారు. కాని ఆ విలువ ఎవరి వలన వచ్చింది? ఇక్కడ సాయిబాబా వుండటం వలననే ఇక్కడ గొప్ప భవనాలు లేస్తున్నాయి. ఒక్క రెండు నెలలు నేను బెంగుళూరులో వుండేటప్పటికి, అన్నిషాపులు మూతలు పడ్డాయి మానవునికి ఏమాత్రం కృతజ్ఞత వుండనవసరంలేదా? ఒక్క వ్యక్తి వలన యిక్కడ ఇంతటి ప్రగతి జరుగుతున్నది. పెద్దపెద్ద పట్టణాల లోపలకూడా ఇంతటి పెద్ద హాస్పిటల్ కట్టలేదు. ఈ కుగ్రామం లోపల ప్రపంచంలో లేనటువంటి హాస్పిటల్‌ను యిక్కడ నిర్మించాం పుట్టపర్తి కుగ్రామం లోపల విమానాశ్రయం వస్తుందని ఎవరైనా ఊహించారా? ఒక్క వ్యక్తి యిలాంటి అభివృద్ధిని పది సంవత్సరములలో సాధించాడు. దీనికంటే గొప్పతనం మరొకటిలేదు. ఇది కేవలం వర్ణించడానికి చెప్పడం లేదు, వాస్తవాన్ని చెప్పి ప్రజలలో ఈ సత్యాన్ని హెచ్చరించే నిమిత్తం చెబుతున్నాను నాకు ప్రచారం అవసరంలేదు. నేను ఇది చేస్తున్నాను, అది చేస్తున్నానని చెప్పను. కాని ఈనాటి పరిస్థితులను పురస్కరించుకొని ఈ సత్యాన్ని కొంతవరకు హెచ్చరింపజేయాలి కాబట్టి జేస్తున్నాను. ఎవ్వరూ నోరెత్తి విమర్శించడానికి వీలులేదు, వేలెత్తి చూపడానికి అవకాశంలేదు. అసూయాపరులు వేలే కాదు ఎన్నైనా చూపవచ్చు అలాంటి వారికి మనం ఏమాత్రం జవాబు చెప్పనవసరంలేదు. వారిది వారినే శిక్షిస్తుంది. కనుక మనం శిక్షించనవసరంలేదు.

## దివ్యాత్మస్వరూపులారా!

రాబోయే కాలంలో మీరందరూ ఈ సేవలలో పాల్గొనడానికి తయారుకావాలి. ప్రపంచమంతా ఒకవిధమైన దిగ్విజయమును సాధిస్తాం. ఈ సందేశములను మీ హృదయములలో భద్రపరచుకొని సంసిద్ధంకాండి. సాయికి ఏదీ ఇషములేదు సాయి ఏదీ మీ నుంచి కోరటంలేదు. కాని నేను కోరేది ఒక్కటే. నిర్మల



మైన ప్రేమతో, విశాలమైన భావంతో సమాజ సేవ చేయండి. అనవసరమైన విషయాల లోపల నేను ఎప్పుడూ ప్రవేశించను. అందరూ మనవారే అందరియందు మా దైవత్వమున్నది అయితే దురదృష్ట వశాత్తు, ఏ జన్మాంతర కర్మవశాత్తో కొన్ని పిచ్చిబుద్ధులు పుడుతూవుంటాయి అవి కూడా తాత్కాలికంగా వచ్చే టటువంటివేగాని శాశ్వతమైనవి కావు. కనుక మనం ఎవ్వరినీ ద్వేషించనవసరంలేదు. అందరిని ప్రేమించి అందరి మంచిని కోరి, "లోకా స్సమస్తా సుఖినో భవంతు" అనే విశాలభావంతో జీవించడానికి ప్రయత్నం చేయండి. ఏమాత్రం అవకాశం చిక్కినా సాయి సంస్థలలో చేరండి ఇంతకంటే పవిత్రమైన సంస్థ వేరొకటి లేదు. లోకంలో ఎన్నో సంస్థలున్నాయి. వాటి విషయం నేను చెప్పను మన సంస్థలో వుండి నంత పవిత్రత ఏ సంస్థలోనూ కూడా లేదు. గిట్టని వారు ఎన్నో మాట్లాడవచ్చునుగాని, మన సంస్థలయొక్క లక్ష్యం ఎప్పుడూ ఉపకారమే ... ఉపకారమే ... సహాయమే ... సహాయమే ... ఇదే మన సంస్థల ప్రధానమైన లక్ష్యము. నాకు జాతి మత కుల భేదములు ఏమాత్రమూ లేదు నవంబర్ 18 వ తేదీన జరుగు వివాహములకు అందరూ వచ్చి ఆనందాన్ని పంచుకోండి.

(ది 24-10-93 న విజయదశమి పవిత్ర దినాన భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి)

# బాహ్యదృష్టి-అంతర్దృష్టి

భగవంతుడు అనేక విధములుగా భక్తులను సంరక్షించుటకు ఎన్నో ఉపాయములు పన్నుతాడు. దానిలోని అంతరార్థమును భక్తులు గుర్తించుకోలేక భగవంతుడు తమను హింసించినట్లు భావిస్తారు, మానవునిది బాహ్యదృష్టి, మాధవునిది అంతర్దృష్టి. అంతర్దృష్టి గల ఆత్మస్వరూపుడైన పరమాత్మ నిరంతరమూ భక్తుల క్షేమమునే కోరుతాడు. ఏది చేసినా క్షేమమే అంతరార్థముగా ఉంటుంది. ఎంతో ప్రేమతో పెంచిన బిడ్డనయినా తప్పు చేసినచో ఆ బిడ్డను తల్లి శిక్షిస్తుంది. ఎంతో ప్రేమతో పెంచి, పెద్దచేసి, కఠినముగా కొట్టినదే ? అని మీరు అనుకుంటారు. ఆ కొట్టడము ప్రేమతోనే కొట్టింది. అదే విధముగా విశ్వపతియైన భగవంతుడు తన బిడ్డలను ప్రేమతో శిక్షిస్తుంటాడు. అంతమాత్రముచే, భగవంతుడు కఠినుడు, హింసాప్రవృత్తినిఅవలంభిస్తున్నాడని భావించరాదు అతనికి నిరంతరము అనుగ్రహమే తప్ప ఆగ్రహము లేదు. ఒక్కొక్క సమయంలో కఠినముగా మాట్లాడుతాడు. హృదయము మాత్రము అమృతమువలె ఉంటుంది. కనుక, భగవంతుని చిత్తమును హృదయమును గుర్తించుకొనుటలో చాల జాగ్రత్తగా ఉండాలి.

— బాబా

( 4 వ పేజీ తరువాయి )

కుంటున్నాం ? గాలి భగవంతుడని తెలిసి కూడా దానిని ఎన్ని విధముల అపవిత్రం చేస్తున్నాం ? నీరు భగవంతుడని తెలిసి కూడా నీరును ఎంత దుర్వినియోగం జేస్తున్నాం ? శబ్దము భగవంతుని స్వరూపమని తెలిసి కూడా ఎంత కఠినమైన మాటలు ఉపయోగిస్తున్నాం ? శ్రవణం పరమాత్మ స్వరూపమని తెలిసికూడా, ఎన్ని చెడ్డ విషయాలు వింటున్నాం ? కనుక ఈ పంచభూతము లను అపవిత్రం చేసుకొని అనుభవిస్తున్నాం. ఈ పంచ భూతములను పవిత్రమైన మార్గంలో మనం అనుభవించి నప్పుడుమాత్రమే పరమాత్మ మనకు సాక్షాత్కరిస్తాడు.

భగవంతుడు మొట్టమొదట శబ్దస్వరూపుడు. కనుక పవిత్రమైన శబ్దమునే మనం వినాలి పరదూషణలు గాని, పరనిందలుగాని, పరహాస్యములనుగాని మనం వినకూడదు అలాంటివి ఏమైనా సంభవించినప్పుడు ఆ స్థానం వదలివెళ్ళు. ఆ పరనిందలు నీవు విన్నప్పుడే నీవు మహా పాపిగా మారిపోతావు. నీవు వేరే పాపములు చేయనక్కరలేదు. ఈ విన్నటువంటివే నీ పాపానికి మూలకారణం. త్రాగే జలమును పరిశుద్ధమైనది తీసుకో. నీవు మాట్లాడేటటువంటి మాటలు చాలా పవిత్రమైనవిగా మాట్లాడు. పరులను నొప్పించేటటువంటివిగాని, పరులను బాధించేటటువంటి మాటలను ఉపయోగపెట్టవద్దు. నీవు ఎవరినైతే బాధిస్తావో, ఆ బాధకు పదింతలు నీవు అనుభవించవలసివస్తుంది. ఈ ప్రపంచ ఒక పరిశుద్ధ మైన అద్దము వంటిది నీవు ఏమి చేస్తున్నా, అవన్నీ ప్రతిబింబంగానే కనిపిస్తుంటాయి. నీ వనుకుంటావు. నేను ఎవరికో అపకారం చేసినానని, చాలా పొరపాటు ఆ అపకారం వడ్డీతోపాటు నీకే లభ్యమవుతుంది. అనేక రెట్లు అధికంగా నీకు తిరిగివస్తుంది ఇది మంచిదికాదు మనం ఎవ్వరినీ నొప్పించకూడదు. మనం ఏదైనా ఒక విషయాన్ని విన్నప్పుడు మన మనస్సుకు బాధ కలుగుతుంది. నీకు బాధ కలిగినటువంటి విషయం, తిరిగి పదిమందికి చెప్పడం - అదీ పాపమే. ఆమాట విన్నప్పుడు నీవే బాధపడుతున్నప్పుడు, మరల ఇతరులను కూడా బాధపెట్టడం వలన నీవు పుణ్యం చేసినట్లు ఎట్లా అవుతుంది ? కనుక వాడు చేసిన పనే నీవు కూడా చేసినవాడవవుతావు నీకు కష్టమని తోచిన విషయమును ఎవరికీ హెచ్చరించకూడదు ఎవరి చెవిలోనూ పడ వేయకూడదు. కాని ఈనాటి కలియుగ ప్రభావంవలన ఏదైనా చెడ్డ విషయము వినగానే అది నిజమో, కాదో తెలుసుకోకుండానే న్యూస్ పేపరులాగే పయనమై పోతుంది. ఈనాటి మానవుడు అమితమైన పాపములకు గురికావడానికి ఇదే కారణం. అందరి మనస్సులూ నొప్పిస్తున్నారు. అందరిని బాధిస్తున్నారు. ఇది మహా పాపం. కనుక అలాంటి మహా పాపమునకు మీరు గురికాకూడదు. చేతనైతే మంచిచేయి. చేతకాక పోతే నోరుమూసుకొని కూర్చో ఇదే సరియైనమార్గం. కనుక ఎవరిని బాధించినా దైవాన్ని బాధించినవాడవే అవుతావు ఎవరిని ఆనందపెట్టినా భగవంతుని ఆనంద పెట్టినవాడవే అవుతావు. Help ever, Hurt never అన్నారు చేతనైతే ఉపకారం చేయి.ఉపకారం చేయటం చేతకాకపోతే అపకారం మాత్రం చెయ్యద్దు అదే పెద్ద ఉపకారం.

ఇలాంటి సత్కర్మలు నిత్యజీవితంలో చేయవలసినవి ఎన్నో ఉండగా, ఇవన్నీ మరచిపోయి రాం...రాం... అని జపంచేస్తే వచ్చే ఫలితం ఏమిటి ? మొట్టమొదట నీ పాత్రను శుద్ధి చేసుకో. నీ హృదయమును నిర్మలం చేసుకో. ఆ నిర్మలమైన మనస్సుతో దేనిని చేసినా దిగ్విజయమును సాధిస్తావు. నిర్మలమైన మనస్సుతో రాయిని ముట్టినా రత్నంగా మారిపోతుంది. మట్టిని ముట్టినా బంగారం అవుతుంది కాని మాలిన్యమయిన మనస్సుతో బంగారమును ముట్టినా మట్టి అయిపోతుంది.

తుచ్ఛమైన భావాలకు మన హృదయంలో చోటివ్వ కూడదు ఈ అల్లరిమార్గంలో మనం ప్రవేశించ కూడదు. ప్రశాంతమైన జీవితంలో మనం ప్రవేశించాలి ఎక్కడ ఉన్నది ప్రశాంతి ? ఎక్కడా లేదు. పంచ భూతములలోనే లేదు. కనుకనే దేశంలో ఇన్ని రకముల విప్లవాలు సంభవిస్తున్నాయి భూమికూడా కంపించి పోతున్నది అగ్నికూడా ప్రజ్వరిల్లుతున్నది నీరు కూడా పుడులు తిరిగిపోతున్నది. ఈ పంచభూతములు కూడనూ మానవుని అనేక విధముల బాధిస్తున్నాయి. దీనికి కారణమేమిటి ? మన మనస్సే మూలకారణం. మన మనస్సులు మంచిగా వుంటుంటే యీ విధమైన దుర్మార్గములు ప్రపంచంలో జరగనే జరగవు.

మానవుడు మితిమీరిన ఆశలు పెంచుకుంటున్నాడు. మితిమీరిన ఆశతో మతిని చెడగొట్టుకుంటున్నాడు. మతి చెడటం వలన దేశమే చెడిపోతున్నది. ప్రపంచంలో నున్న ఈ పంచభూతములు నీయందు కూడనూ ఉంటు న్నాయి. కనుక నీలోనున్న పంచభూతములను నీవు మొట్టమొదట పరిశుద్ధం చేసుకో. ప్రాకృతమైన విషయ వాసనలలో అమితంగా ప్రవేశించవద్దు. ఎంతవరకో అంత నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు. 'కర్తవ్యం యోగముచ్యతే'. దైవాన్ని చింతించు. దైవాన్ని స్మరించు. ఆ దైవాన్ని చింతించి, స్మరించినటువంటి నాలుకతో యితరులను దూషించకూడదు, విమర్శించ కూడదు అసత్యము ఆడకూడదు. మానవునికి భగవంతుడు మంచిచెడ్డలను రెంటినీ చూడమని రెండు కన్నులిచ్చాడు ఒకవేళ చూడటానికి ఇష్టం లేకపోతే మూసుకోవటానికి రెప్పలు ఇచ్చాడు. మంచి చెడ్డ విషయాలు వినమని రెండు చెవులు యిచ్చాడు. పరిశుద్ధమైన గాలిని పీల్చుకోమని, అశుద్ధమైన గాలిని వదలమని రెండు ముక్కు రంధ్రాలు యిచ్చాడు. కాని నాలుక మాత్రం ఒక్కటే యిచ్చాడు కనుక దీనికి ఒక్కదానినే ఉపయోగించుకో. ఒకసారి ఒకటి, మరొకసారి మరొకటి చెబితే, రెండు నాల్కలు వున్నది విషసర్పము. కనుక నాలుక ఒక్కటే.

" ఏకం ఏవ అద్వితీయం " " ఏకం సత్ విప్రా బహుధా వదంతి " సత్యం ఒక్కటే. రెండు కాదు, కనుక నిత్య జీవితంలో మనం చేయవలసినవి చక్కగా నేర్చుకోవాలి, అబద్ధాలు చెప్పడం, అన్యాయాలు చేయడం కాని నేను క్షేమంగా వుండాలని ఆశించడం క్షేమమౌతుందా ? క్షేమమౌతుందా ? కాదు ... కాదు ... నీవు క్షేమంగా వుండాలనుకుంటే క్షేమమైన పనులు చేయి.

యీనాడు ప్రపంచ వాంఛలు అమితంగా మితిమీరిపోతున్నాయి. ఎంత ఆశలు మీరిపోతున్నాయో, అంత ఆనందం తరిగిపోతున్నది రాగద్వేషములు అధికమైన కొద్దీ ఆయుఃప్రమాణం తగ్గిపోతున్నది. మన ఆయుః ప్రమాణం తగ్గిపోవటానికి ఆశలూ, విచారములే మూల కారణం వీటికి చోటివ్వద్దు 'ఈశావాశ్య మిదం సర్వం' భగవంతుడు సర్వత్రా వుంటున్నాడని సర్వమూ భగవంతుడేనని ఈశావాశ్యోపనిషత్తు చక్కగా పునాదివేసి ప్రబోధించింది. ఎలాంటి పునాది వేసింది? దానిపై అనేక అంతస్థులు కట్టుకోవచ్చును. దీనికి వెరువదు, భూకంపాలకు కదలదు భూమిలో ఏ కంపమూ లేదు అన్ని కంపములూ నీయందే వుంటున్నాయి మనోకంపముల ప్రతిబింబాలే భూకంపాలుగా మారుతున్నాయి కనుక అందరూ భగవంతుని ప్రార్థించండి. " లోకా సమస్తా సుఖినో భవంతు " అని ప్రార్థిస్తే భగవంతుడు సర్వులకూ సంతోషాన్ని, అనందాన్ని ఆరోగ్యాన్ని, అందించి ఆత్మానందాన్ని కూడా అందిస్తాడు. అదియే మూలాధారము. దానిని వదల కూడదు కొమ్మలు కొట్టు, ఆకులు తీసివేయి, కాని Roots (వేళ్ళు)ను మాత్రం కొట్టవద్దు దానిని కొడితే చెట్టే పడిపోతుంది దేనిని కొట్టాలి ? దుష్టభావములను కొట్టండి, మంచిదానిని కొట్టకండి అందరినీ ప్రేమించండి అంతో ఇంతో మిగిలితే నన్ను నీవు ప్రేమించుకో. పరులను సంతోషబెట్టు తరువాత నీవు సంతోషించు. అదే నిన్ను ఉన్నతస్థాయికి తీసుకొనిపోతుంది.

( ది 22–10–93 న ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి. )

( 3వ పేజీ తరువాయి )

ప్రయోజనం లేదు. ఆచరణలోపెట్టని విషయాలు ఎన్ని విన్నా నిష్ప్రయోజనమే అవుతాయి ఈ వాస్తవమును ప్రతిఒక్కరూ గ్రహించి ఆచరణకు పూనుకోవాలి.

ఈ అసూయా ద్వేషములే అలనాటి పచ్చని రాజ వంశాలను ఎన్నింటినో పతనం చేశాయి. షిర్డీలో బాబా ఆజ్ఞతో 'సాఠేవాడా' ను నిర్మించిన హరిపినాయక సాఠేను అసూయా, ద్వేషములతో షిర్డీ బాబా భక్తులే చంపటానికి ప్రయత్నించుతే, అతను షిరిడీ వదలిపెట్టి వెళ్ళక తప్పలేదు. తెలివితేటలలో తనకన్నా మించి పోతున్నాడనే బాధతో, అసూయతో, ద్వేషంతో, ద్వేషాగ్నిని పెంచుకొని ఏదోవిధంగా శిష్యుడయిన రామానుజాచార్యులవారిని హతమార్చాలని ఆయన గురువు అయిన "యాదవ ప్రకాశు"ల వారే ప్రయత్నించారు. స్వార్థంతో, అధికార వ్యామోహంతో ఎంతోమంది తండ్రులను హతమార్చిన తనయులు కూడా చరిత్రలో కనిపిస్తారు స్వార్థంతో రాజులను, చక్రవర్తులను సంహరించిన సేనాధిపతులూ కనిపిస్తారు. ఈ అసూయా ద్వేషములకు హద్దులులేవు. అంతటి వారే వీటికి లొంగినప్పుడు మనమనగా ఎంతటి వారం? అని అంటారు. అయితే మానవుడు తలచుకుంటే సాధించలేనిదంటూ ఏదీ ఉండదు. అయితే సాధించగలననే విశ్వాసం మాత్రం కావాలి "మన సత్యాన్ని మనం వదలకుండా వుండాలి. ఆ విశ్వాసమే నిజమైన భక్తులయొక్క శ్వాసంగా భావించాలి. కనుక మీరు ఈ భక్తిప్రపత్తుల తత్త్వమునందు విశ్వాసమును మాత్రం దృఢంగా ఉంచుకోవాలి" అని అంటారు బాబా. కనుక మనలో విశ్వాసం సడలకుండా, దైవాన్ని విశ్వసిస్తూ ముందుకు సాగిపోవాలి.

"అసూయాపరులు ఎన్నో రకములైన కట్టుకథలు పుట్టిస్తారు. ఈ అసూయకు తగిన ద్వేషం మరింత రెచ్చగొడతారు. వీరంతా శకుని సంతతివారే ఈ శకుని సంతతి దుర్యోధన దుశ్శాసనాదుల వద్దనే జేరుతుంది పాండవులవద్ద జేరదు. ఇలాంటి దుర్యోధన దుశ్శాసనులతో కూడిన ఈ శకుని తత్త్వం ఏనాటికైనా నాశనమే అవుతుంది. మంచికి ఏనాటికీ లోటురాదు" అని చెప్పారు బాబా. కనుక ఈ అసూయాద్వేషాలను రేకెత్తించేటటువంటి దుష్టజనులకు దూరంగా ఉండటం మంచిది. వారితో జేరితే అలనాడు భీష్మద్రోణాదులకు పట్టిన గతే పట్టుతుందనే నగ్నసత్యమును విస్మరించరాదు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ది 23-10-93 న ప్రశాంతినిలయ ప్రాంగణంలో చేసిన దివ్య ప్రసంగం మరువరానిది. హృదయంవున్న ప్రతి ఒక్కరూ తీవ్రంగా ఆలోచించవలసిన విషయం దానిలో వున్నది. బాబా స్పష్టంగా ఒక నగ్నసత్యాన్ని బహిర్గతం చేశారు. వారి మాటలు మననం చేసుకుంటే కర్తవ్యం బోధపడుతుంది వారి ఆవేదనను అర్థం చేసుకుంటే జ్ఞానోదయం అవుతుంది. "అధికారులు వస్తున్నారు, స్వామిని దర్శించుకుంటున్నారు. తమతమ అభీష్టాలను కోరుకుంటున్నారు, నమస్కరిస్తున్నారు, వెళ్ళుతున్నారు. వ్యాపారస్థులు వస్తున్నారు తమతమ వ్యాపారముల యొక్క అభివృద్ధి నిమిత్తమై ఆశీర్వాదములు కావాలని ఆశిస్తున్నారు, పొందుతున్నారు, వెళ్ళుతున్నారు. ఉద్యోగస్తులు వస్తున్నారు, వారివారి అభీష్టముల నెరవేర్చుకొనే నిమిత్తమై, ఏ ట్రాన్స్ఫరో, ఏ ప్రమోషన్లో కోరుతున్నారు, ఆశిస్తున్నారు, అందుకొని వెనుకకు వెళ్ళిపోతున్నారు విద్యార్థులు వస్తున్నారు, విద్య నభ్యసిస్తున్నారు, విద్య పూర్తికాగానే వెళ్ళిపోతున్నారు. ఇంక అధ్యాపకులు వస్తున్నారు, వారు ఏదో పిల్లలకు Teach చేస్తున్నారు. వారు వారి పని ముగించుకొని Retire అయిన తరువాత వెళ్ళిపోతున్నారు. ఆస్తికులు వస్తుంటారు, స్వామి సన్నిధికివచ్చి ఏ జపమో, ఏ ధ్యానమో,

ఏ యోగమో, ఏ తపస్సో చేసుకుంటూ, వారి జీవితమును సార్థకం గావించుకొనే నిమిత్తం మార్గములను వెతుక్కొని వారి పాటికి వారు వెళ్ళిపోతున్నారు ఇంతమంది వస్తున్నారు, ఇన్నికార్యములు చేసుకుంటున్నారు స్వామి విషయం ఎవరైనా విచారిస్తున్నారా? స్వామి నిమిత్తమై పాటుపడేటటువంటివాడు ఒక్కడైనా కనిపిస్తున్నాడా? ఎవరూ లేరనే విషయం నాకు తెలుసు ఎవరి స్వార్థాన్ని, ఎవరి స్వప్రయోజనాన్ని వారు చూచుకుంటున్నారు అందరమూ మేము భక్తులమే... మేము భక్తులమే అంటారు. ఇది భక్తి అని చెప్పుకోవడం కూడా సిగ్గుచేటు. నా నిమిత్తమై నేను చెప్పడం కాదు యిది. మీ నిమిత్తమై మిమ్ములను హెచ్చరిస్తున్నాను. మీరు పొందినటువంటి ఫలితమునకు తగినటువంటి కృతజ్ఞతను మీరు హృదయంలో నింపుకోవాలి. కృతజ్ఞతలేనటువంటి హృదయం క్రూరమృగములకంటే హీనం" అని తమ ఆవేదనను బాబా వెలిబుచ్చారు. ఈ మాటలు ఎంతటి కఠిన హృదయములనయినా ద్రవింపజేస్తాయి. వారి భావములను అర్థం చేసుకుంటే బాధ్యత బోధపడుతుంది. సహృదయులకు అర్థమవుతుంది బండబారిన శరీరము (Thick Skined) గలవారికి అర్థం కాదు, మనసుకు ఎక్కదు. మానవత్వం గల మనుషులకు మాత్రమే అర్థమవుతుంది. దానవ, రాక్షస, పశుప్రవృత్తులు గలవారికి ఏమాత్రం బోధపడదు. సద్భావనలు, సత్సంకల్పాలు, సదాలోచనలు గలవారు మాత్రమే అర్థం చేసుకోగలరు దుర్భావనలు, దుష్టసంకల్పాలు, దురాలోచనలు గలవారికి ఈ మాటలు ఏమాత్రం రుచించవు, మనస్కరించవు.

అలనాడు శ్రీరామచంద్రుని కాలంలో మనం కోతులుగా వుండి రామసేవ చేసామో ! లేదో ! మనకు తెలియదు. శ్రీకృష్ణుని కాలంలో గోపికలుగా గాని, గోపాలురుగా గాని వుండి కృష్ణ సేవ చేసామో ! లేదో! మనకు తెలియదు పూర్వజన్మ సుకృతం వలన ఈనాడు ఈ సాయిరాముని ఈ సాయికృష్ణుని అవతార కాలంలో వుండే మహద్భాగ్యం మనకు లభించింది అందులో సాయి సేవకులుగా, సాయి భక్తులుగా వుండే మహత్తర అవకాశం మనలో కొంతమందికి మాత్రమే లభించింది. ఇది ఆశిస్తే అందరికీ లభించేది కాదు, ఇంకా సాయి సన్నిధికి చేరనివారెందరు లేరు? చేరినవారు అదృష్టవంతులు. ఎందువలనంటే సాయి చెప్పేది సత్యం, బోధించేది సత్యం, ఆచరించేది సత్యం. "మూర్తీభవించిన సత్యస్వరూపమే శ్రీ సత్యసాయిబాబా" ఈనాడు బాబావారు ఎన్నో అమూల్యమైన విషయాలను సమాజానికి అందిస్తున్నారు. వేద రహస్యాలను విడమరచి చెబుతున్నారు. ఉపనిషత్తుల సారాన్ని మన ముందుంచుతున్నారు. పురాణ ఇతిహాసముల అంతరార్థములను అర్థమయ్యే రీతిలో వరిస్తున్నారు. సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలను మానవునిలో పెంపొందించాలని ఎంతో శ్రమిస్తున్నారు. మానవత్వం, ప్రేమతత్త్వం పెంచడానికి ప్రయత్నిస్తున్నారు. అంతేకాదు విద్య, వైద్య, సేవారంగములలో మానవమాత్రులు చేయలేని ఘనకార్యాలను, తమ దివ్య సంకల్పంతో చేస్తూ సమాజానికి ఎంతో మేలుచేస్తున్నారు, విద్యాదానం చేస్తున్నారు, ప్రాణభిక్షనుపెడుతున్నారు. వాటిని పొందుతున్న మనం ఎల్లవేళలా కృతజ్ఞులుగా వుండాలి గాని కృతఘ్నులం మాత్రం కారాదు. మన నుండి స్వామి ఏమీ ఆశించడం లేదు కొండంత దేవునికి కొండంత పత్రిని యివ్వలేము గదా!మన మనస్సులు మాత్రం మారాలని స్వామి కోరుతున్నారు అయితే యీనాడు మనుష్యులు మారుతున్నారు గాని మనసులు మాత్రం మారటం లేదు. ఇవి ఏనాటికి మారుతాయో ! ...



శ్రీవాణి

జీవితసభ్యులు



శ్రీమతి & శ్రీ
పి.వి.ఎస్. సోమయాజులు
మద్రాసు

ఆకుల వీరభద్రరావు
మరియు వారి భార్య (లేటు) భ్రమరాంబ
ఖమ్మం







**Dr. G. Mallesham**
SIDDIPET

**K.V.R. Surya Rao**
Asst. General Manager
H. M. T.
Hyderabad

**Dr. K. Ratna Mohini**
Hyderabad

**V. Subrahmanyam**
Lecturer L.E.E.
Govt. Jr. College
Kothapet, Pin 533 223



### చందాదారులకు మనవి

"శ్రీ సత్యసాయి శతకము" (ప్రథమ భాగము) కాపీలు బహు కొద్దిగా ఉన్నాయి. కావలసినవారు వెంటనే సం చందా రు 48/-లు పంపినచో 'శ్రీవాణి'తో పాటు ఈ 'శతకము' కూడా పంపబడుతుంది. విడిగా అమ్మబడవు, 12 నెలలపాటు "శ్రీవాణి" కూడా పంపుతాము త్వరపడండి !

-మేనేజర్